# సంగీతగులో బకావళి

గ్రంథకర్త.

(చిర్రావధానుల మాణిక్యశర్మగారు)

నవరసములొల్కు ముద్దులమూటగట్టు నాటకరాజము. చక్కని పార్సీకర్ణాటకమట్లతో రచియింపబడినది. యీనాటకమంతయు శృంగారరసమే. మెచ్చటచదివిచూచిన, ఆనందమే. పుస్తకముచదువుట మొదలుపెట్టినచో సాంతమగువరకు విడువజాలరు 0-12-0

# శ్రీ విజయభాస్కర నాటకము.

గ్రంథకర్త

(గుమ్మలమడ్క లక్ష్మీనరసింహంగారు)

భట్టివిక్రమాదిత్యుని మనుమనిచరిత్రమంతయు నాటకముగా వ్రాయబడినది. చాలాఅద్భుతమయినప్లాటుతో వ్రాయబడినది. నూతనపద్ధతి ననుసరించి వ్రాయబడిన ఆరంకములనాటకము. చక్కని సాంగ్సుగలవు. వెల 1-0-0

# గ్రామఫోను హాస్యపు పాటలు

వెల 0-6-0

వల్లూరి జగన్నాథరావుగారిచే రచియింపబడినది.

ఇందు, హాస్యరసమయినపాటలు వింత వింత పాటలు, నవ్వుపుట్టించేపాటలు, అద్భుతమయినపాటలు, మీకు యేరకముపాటలు కావలయునన్నను నిందుగలవు, ఇందు 32 ముప్పదిరెండు పాటలు గలవు. ఈపాటలచ్చటచ్చట గ్రామఫోనులో పాడబడుచున్నవి. ఐదవకూర్పు కొలదిప్రతులు మాత్రమేగలవు. త్వరపడుడు.

# రామరాజు

( ఫాల్ ఆఫ్ విజయనగర్. )

చరిత్రాత్మకమైన ఐదంకముల నాటకరాజము.

గ్రంథకర్త

యద్దనపూడి పురవాస్తవ్యులగు,

బ్రహ్మశ్రీ శనగవరపు రాఘవశాస్త్రిగారు.

ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషరు. భీమడోలు, కృష్ణాజిల్లా,

స్కేప్ అండ్ కో., లో

...తని సహాయాదరుడగు
...
...చ్యుతదేవరాయలు రాజ్యమేలె నాతనికొక్క కుమారుడుకలడు. తండ్రి
...ద్ధిపోయిన యనంతర మీబాలుడు రాజార్హుడు కానంతటి

శ్రీమత్పరదేవతాయైనమః

# పీఠిక.



మహాశయులారా! యీ నాటకము విజయనగరమునకు సంబంధించినది. విజయనగరము తుంగభద్రానదీప్రాంత్యమున హంపీవిరూపాక్షముకడనున్నది యిది విద్యారణ్య మహాస్వామిచే నిర్మింపఁబడి విద్యానగర నామమున కొంత కాలము పేర్కొనఁబడి యనంతరము బుక్కరాజు గుండరాజు మొదలయిన మహాపరాక్రమవంతులచే నిరంతర మరివిజయసాధకమహైశ్వర్యయుక్తమైయుండుటచే రానురాను విజయనగరమని పిలువఁబడుచున్నయది. ప్రస్తుతమీకథానాయకుఁడగు రామరాజు జగద్విశ్రాంతకీర్తియు నూరురాయగండేత్యాది మహాబిరుదాంకితుండును సాళువవంశపయఃపారావార రాకాసుధాకరుండును తురుష్కధాటీప్రవాహమునకడ్డకట్టయు కవిజనాశ్రయుడునగు శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని మేనల్లుడు; ఈతడును దక్షిణాపథమంతయు ఏకచ్ఛత్రాధిపత్యము వహించి విజాపుర బీదర అహమ్మద్‌నగర గోలకొండ మొదలగు మ్లేచ్ఛప్రభువుల తనచేతికీలుబొమ్మలట్లాడించినమహారాజకీయ యుక్తాయుక్తకార్యజ్ఞుడు బలసంపన్నుడు తుదకు మ్లేచ్ఛుల కుతంత్రమువలనవధింపబడినాడు.—ఈతనియనంతరము విజయనగరము యవనులచే హతము కావింపబడి నామమాత్రావశేషమైనది. ఈవిషయమంతయు నీనాటకమునఁ జక్కఁగ సమగ్రముగ వ్రాయఁబడినది.—

## — ఇందుండు కథాంశము. —

శ్రీకృష్ణదేవరాయల యనంతర మాతని సహోదరుడగు అచ్యుతదేవరాయలు రాజ్యమేలె నాతనికొక్కకుమారుడు కలడు. తండ్రి చచ్చిపోయిన యనంతర మీబాలుడు రాజార్హుడు కానంతటి

చిన్నవయసులోనుండెను. అట్టిస్థితియందు రాజ్యమందుదు రెండుకక్షు లేర్పడెను.

1 కృష్ణదేవరాయల సవతితల్లికొమరుడగు సదాశివరాయని పీఠ మెక్కించినచో మేలనెడిరామరాజుకక్షు.

2 బాలుడైనను వెంకటరాజును పీఠమెక్కించి రాజ్యముపరిపాలింపవలెనను మంత్రియగు సలకము తిమ్మయ్యకక్షు.

ఈయిరువాగులందు సామంతులందరును సలకము తిమ్మయ వాక్యమం దేకీభవించి రప్పుడు రామరాజు తనమాటచెల్లకుండుటకు తిమ్మయ్య దురాలోచనకును వెరచి తనవశంగతమగు ఆదవానిదుర్గము నకేగెను. విజయనగరమందు లసకము తిమ్మయ్య రాజ్యకాంక్షచే బాలునికి విషముపెట్టి వధించి తానేరాజునని ప్రకటించినప్పుడీ తంత్రి మెఱింగి సామంతులీతని తిరస్కరించి రామరాజును శరణువేడి రామరాజు సామంతరాజులతో సలకము తిమ్మయ్యపైనెత్తివచ్చె నప్పుడు తిమ్మయ్య వెరచి పురముగాల్చి ఆదిల్షాహాకడకరిగెను. పిమ్మట రామరాజుపురమువాప్పి ప్రజారంజకముగ రాజ్యమునంతయు రామరాజ్యముగ బాలించుచుండెను.

పిదప నీసలకము తిమ్మయ్య విజాపురాధీశ్వరుండగు నాదిల్షావకును నవాబులకందరకును నైకమత్యముగలిగించెను.

ఇంతలో రామరాజుకొడుకులలో నొకడు గతించెను.

దానికి తిమ్మయ్య తంత్రముచే నాదిలుశాహావెడలి రామరాజు కడకరుదెంచి నన్నునీకొడుకట్లు భావింపుమని పాదములవ్రాల నామాటుదుకడంగీకరించినమ్మెను. సామంతులు పలదనిన వినడయ్యె.

తరువాతనవాబు లేకీభవించి రామరాజుపై ససైన్యులై యెత్తి వ
చ్చి తాళికోటవద్ద విడిసి రివ్వార్త రామరాజువిని తానును చతురంగ
బలయుక్తుడై వారినెదిరించెను. ఘోరమగుయుద్ధము ప్రవర్తిల్లె నట్టి
సహాయుద్ధమధ్యభాగమున ఆదిలుశాహా రామరాజునకు సహాయార్థమే
తెంచుచున్నాడని తెలిపి విద్యానగర సైన్యమందు ప్రవేశించి రామరాజు
సైన్యమును జంప మొదలిడెను నప్పుడు శత్రుమోసము గ్రహింపలేక
సంకులమున హిందువులనేకులు హతమై రింతలో నొక యేనుగ బెదరి
సరాజెక్కియున్న టాంజాను నేలబడకూల్చెను. క్రిందపడిలేచు
వృద్ధుడగురాజును నిజభృత్యుడగు పఠానుడొకడు నిర్భీతి నిజకరవాల
మున వధించెను పిదప హిందువులుపలాయితులైరి. రామరాజు సోద
రగు వెంకటరాజీయుద్ధమునమడిసెను. మరియొక సోదరుడగు తిరు
మలరాజు సదాశివరాయునితో పెనుగొండకరిగి యట కొలదిగ రాజ్య
స్థాపించుకొని సదాశివరాయునింజంపి తానురాజయ్యెను.

యవనులీవిజయానంతరము విద్యానగరము ప్రవేశించి సర్వస్వ
దోచి నిరపరాధులగు ప్రజలవధించి వేధించి సర్వశూన్యము
పట్టణమంతయును శ్మశానముగ జేసిరి యీకథ నాటకరూ
చరిత్రకుభిన్నముగానట్లు నా యోపికకొలది వ్రాసితిని. తప్పు
విజ్ఞులు క్షమింతురుగాక !

శనగవరపు రాఘవశాస్త్రి, యద్దనపూడి.

# పాత్ర నిర్ణయము (భూమిక)

---

## పురుషులు.

రామరాజు—కథానాయకుఁడు

వెంకటాద్రి—రామరాజు సహోదరుఁడు

తిరుమలనాయకుఁడు—రామరాజు సహోదరుఁడు

| | |
|---|---|
| వరదనాయకుఁడు<br>గోపానాయకుఁడు<br>తిమ్మప్పనాయకుఁడు<br>చిన్నప్పనాయకుఁడు | విజయనగర సామంత ప్రభువులు |

సలకము తిమ్మయ్య—మంత్రి

అలీ ఆదిల్షాహా—విజాపుర సుల్తాను

బరీద్ షాహా—బీదరు సుల్తాను

నిజాంషాహా.—అహమ్మద్‌నగర సుల్తాను

కుతుబ్ షాహా—గోలకొండ నవాబు

సదాశివరాయఁడు—విజయనగర ప్రభువు

వరాణి—రామరాజు భృత్యుఁడు

(సందర్భానుసారముగ కొందరు చారులు ప్రవేశింతురు)

## స్త్రీలు

తిరుమలాంబ—రామరాజు భార్య

ఆషాభి—ఒక మ్లేచ్ఛ వనిత



శ్రీమత్పరదేవతాయై నమః

# రామరాజు.

(ఫాలాఫ్ విజయనగర్)

## ప్రథమాంకము.

### నాందీ.

ఉ. ఎవ్వని రాజ్యగౌరవము నిప్పటికేనియు "రామరాజ్యమం"
చువ్విళులూరుచుందురి జను "ల్ముత్తది దుష్టుల ప్రాణమానముల్"
యివ్వసుధేశు పుట్టుక "నికెందు నసత్యభయంబు లేదటం
చెవ్వనిగొల్తు" రట్టిపరమేశ్వరు "రాఘవు" నాత్మనెంచెదన్.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి పుష్పాంజలిం జల్లి.)

సూత్ర—ఆర్యులారా!

చ. శనగవరాన్వయుండు బుధసత్తములందున భక్తిఁగల్గి వా
డనుపమబుద్ధి వాఁ జలమాయాఖ్యుని పుత్రుఁడు రాఘవాభిధుం
డినశశితారకంబుగ మహీస్థలిఁ దారచియించె నాటకా
ఖ్యను దగ "రామరాజు" చరితాంశము తద్ఘనరాజ్యనాశమున్.

రసికులగుట నిందుండు నెరసుల క్షీరము రాశిన్యాయంబునఁ బోఁదోలి

కర్ణాటకరాజ్య మెల్ల మ్లేచ్ఛుల పాలబడి కృశించిరియే యిప్పటికి విజయ నగరము నాశనమాత్రావశిష్టమై భయంకరమై శోచుచున్నది త చ్చరిత్ర మీప్రదర్శనమునం గాంచెదరు గాక.

(నిష్క్రమించును.)

(ఆదవాని దుర్గములో నొకమందిరము. రామరాజు,
వెంకటరాజు నుపవిష్టులై.)

రామ—తమ్ముఁడా! వెంకటరాజా! నిజభుజవీర్యవశీకృతది గంతరుండగు శ్రీకృష్ణరాయసార్వభౌముని యశశ్చంద్రికావిరాజితమ గు నీకర్ణాటకరాజ్యలక్ష్మి కింతముప్పుగల్గునని తలంపనైతిని. చూడు.

ఉ. అంచితసత్త్వులైన నృపులాహవమందున రక్తధారల
ర్పించి చరించ, సర్వముభరించుచు ధీరతఁ గృష్ణరాయఁడా
ర్జించిన కోటలెన్నియొ హరించిరి మ్లేచ్ఛులు కీర్తి నెంతయోఁ
గాంచిన "రాయచూరు, ముదగల్లు" స్మరించిన గుండెవ్రీలెడిన్.

అయ్యో! లక్షలకొలది హిందువుల ప్రాణము లర్పించి సాధించి కీర్తిఁ గాంచిన నారెండుదుర్గము లెన్నటికైన మఱపునకు వచ్చునా? (విచారించును.)

వెంక—అన్నా! వగచినఁ బ్రయోజనమేమి—

ఉ. "అంతటివార మింతటిమహాత్ముల మంచని" కారులాడుచుఁ
గంతులువైవలేదె మనకైవసమాయని యూటలూరి సా
మంతులు "గెల్తు నేనని ప్రమాణముఁ జేయఁడె" తిమ్మరాజు దు
ర్దాంతుఁడు వాఁడెయింతటివ్యథా పరిరక్షకుఁడయ్యె నక్కటా.

రామ—"సలకము తిమ్మయ్య" నామమువినినంత నాయొడ లుడుకుచున్నవి— వాని మాయావాగురులంబడి సామంతరాజు లించుక యు గ్రహింపరు కదా? తమ్ముఁడా! యీనాఁడేటికో మనసుమనసులో

లేకుండెను—పరాక్రమ దుర్నిరీక్ష్య ప్రతాపవంతు డగు సదాశివరా యని రాజ్యాభిషిక్తునిగఁ జేయుద మనిన, దురాలోచన గల తిమ్మయ్య, వలదని నుడివి సైన్యము లెల్లఁ దనయొడిలో వైచికొని బాలుఁడగు వెంకటరాజును పీఠ మెక్కించి సర్వాధికారము వహించి పరిపాలింపవలయు నని యుద్దేశించి యింతఁ జేయుచున్నాఁడు. అయ్యో! అచ్యుతదేవరాయ నియనంతర మీవిజయనగరరాజ్య మెట్టిస్థితికి బాలయ్యె మనకీయాద వనిదుర్గమే నివాసమయ్యె. కటకటా! బాలుఁడును, బావమఱఁదియు, తండ్రిలేనిబిడ్డయు నగు వెంకటరాయనిఁ జూచివచ్చుటకైన నోచుకొన నైతినికదా? మామగారిల్లనుమాటయే కలవయ్యెనే? శ్రీకృష్ణరాయని పుత్రిక నొసఁగిన సంబంధ మచ్యుతదేవరాయని వఱ కించుక నిలిచిన దిప్పుడు రాకపోకడలకే నోచుకొనలేదు—ఆహా! కాలమహిమ—

ఉ. బాలిశుఁడైన తిమ్మనరపాలుని చేష్టల నుక్కుఁ దక్కి యి
ట్లాలము సేయ నోడి యువవాళి హసింపఁగ, తేనిపోనిక
య్యాలకు కాలుద్రవ్వెడి దురాత్ములఁ గంటివి భారతాంబ! దు
ష్కాలము చేతఁ జిక్కితివిగా? యిటునీవును మమ్మువోలె హా.

(తలపంకించి) యేది యెట్లున్నను వెంకటరాయని కెట్టి సంకటమును కలుగకుండినచో, కీడులో మేలు—

వెం—దుర్మార్గుఁడగువాఁ డెట్టి కృత్యమునకైన లొంగఁడు.

రామ—అట్లేని సామంతరాజులు మన కెట్లు వశంకరులగుదురు? సైనికులు మనమాటల నెట్లంగీకరింతురు? వారి మనంబుల తిమ్మయ్య మాయావాగురు లాపాదమస్తకపర్యంతము విషమువోలె యాపాదించి మైకము కలుగ జేసినదికదా? కర్తవ్యమెట్లు?

వెంక—సుల్తానుల నేకీభవింపఁ జేసిరి మనము వారలలో బ్రవేశించి—

రామ—కొంకకు ఓచ్చు బెట్టుకొనుటయే. ఎంత వెఱ్ఱి. పృథ్వీ రాజుపై గపసి తానొక్కడుసు జయింపనోడి మహామద్గోరీ సహాయమపేక్షించిన జయచంద్రుని గతి నెఱుంగవా? యిది సమంజసముగుతోంపగాదు—విజాపురాధీశ్వరుండగు ఆదిల్షాహ మాత్రము మనకు కొంచె ముపకారియట్లు తెలియుచున్నది.

(సేవకుడు—ప్రవేశించి) సేవ దేవా! గూఢచారులు దర్శనార్థ మేతెంచిరి. సెలవైన—

రామ—త్వరగ బ్రవేశ పెట్టుము—సరియే యిదికొంత మేలు—

(గూఢచారులు ప్రవేశము)

1 చారు—మహారాజా! నమస్కారము.

రామ—విశేషము లేమి?

2 చారు—ఆర్యా: సలకము తిమ్మయ్యకును సామంత ప్రభువులకును కొంచె మంతఃకలహములు కలిగినవని వదంతి. ఎప్పటియట్లూడిగములఁ జేయుచునే యున్నారు—

రామ—అంతఃకలహములకు కారణమేమి?

1 చారు—భామినీసుల్తానులకును వాసికిని లోలోపల వేగులుజరుగుచున్నవట

రామ—(తనలో) అనుకొన్నంతయైనది—(ప్ర) ఇదెట్లు గ్రహింపఁగలిగిరి?

2 చారు—మహమ్మదీయులకు కొందఱకు కోటలో నిరాటంక ప్రవేశమువలన.

రామ—కోటలోనికి ప్రవేశమే ?

1 చారు—వారలకును సలకము తిమ్మరాజునకును రహస్యభవనమున నేవియో కొన్ని ప్రసంగములు జరుగుచుండ—

రామ—మహమ్మదీయు లెవరి యనుచరులో గ్రహింపఁగలి గితి రా?

1 చారు—తెలియదు. విశేషము లీయుత్తరమున గ్రహింపుఁడు—(ఇచ్చును.)

రామ—(అందికొనిచూచి) సరియే. మీ రింకేమే చోటుల కరిగితిరి.

2 చారు—ఆదిల్శాహారాష్ట్రమున మనపై రాజునకు ప్రేమ కలదని జనులాడుకొనుచుండిరి. నిజాం రాష్ట్రమున కుతుబ్షాప్రవర్తన ము మనకు వ్యతిరిక్తసన్నాహము. సైన్యమంత బలిష్ఠముకాదు. నవా బున కేహాత్రమైనఁ నైకమత్యము లేదని తెలియుచున్నది—ఇదియే మాయెరింగిన తెఱంగు—

రామ—పొండు—(గూఢచారులు నిష్క్రమింతురు.)

రామ—తమ్ముఁడా : మన మేపనిచేయుటకైన నిదిసకాలమని భట్టువారిసివాఁడు—స్వల్పసైన్యముఁగల మనమేపనిచేయఁగలము—క్రమమున నొక్కొక దుర్గమాక్రమించుట కిది సకాలమా? సామంతుల ప్రోత్సహించి విడదీయుటకు సకాలమా? ఆదిల్శాహ సహాయమపే క్షించుటకు సకాలమా?

వెం—అన్నా! ప్రస్తుతము పేక్షించినచో మేలగు నేమిరా—

గీ. ప్రజలకు హితంబుఁగోరి శౌర్యముఁ జూరి
యవనుల వధించుటర్థమై యలరుగాక
లేనిపోని వైరంబులఁ బూని స్వకుల
నాశనముఁ జేయుపని మేలనంగఁదగునె.

రామ—తన పెరటియందుఁ బెరగినను ముండ్లచెట్టు నెవ్వఁడు స మూలముగఁ బెరకివైవడు? దుష్టుఁడగు సలకము తిమ్మయ్య నయోగ్యాధి

పత్యభ్రష్టునిగా విడువని చో విజయనగర రాజ్యము వినాశనమగుట కెట్టి సందియమును లేదు—

ఆ. వె. జెముడుమ్రాక మొదటఁ జిన్న దేయైన వ
ధించకున్న నాక్రమించు నేల
విసముకొంచెమైన వెసశరీరం బెల్లఁ
బ్రాకి ప్రాణములను బాపు కాదె.

దుష్టులయెడ నెట్టియుపేక్షయు కూడదు. నీవు సమస్తసైన్యముల నాయత్తపరుపుము. పాదండయాత్ర మొదట విజయనగరముపై విష్కం టకముగ వెడలుగాక—మనయందెప్పటికి లోపముండరాదు—సామంతప్రభువులకీ విషయముఁ దెలుపుటయు, మన కెవరేని సాయమే తెంచి నచోఁ గైకొనుటయు ననుష్టేయములు.

వెంక—చిత్తమట్లే (తెరలో కలకలము.)

రామ—(విని) యిదేమికలకలము? ఓరీ యెవఁడురా, అక్కడ.

సేవ—(ప్రవే) అయ్యా! విజయనగర సామంతప్రభువు లేతెంచియున్నారు.

రామ—(తనలో) కారణమేమి ? దురుద్దేశమించుకయు నుండదు. నామాటలా నాఁడు తిరస్కరించినను,నిజము నిలకడపై తెలిసియుండకపోదు—పురాగతమేదియో సంభవించియుండును—(ప్ర) సన్నాహామెట్లున్నది?

సేవ—సైన్యరహితులును, ఆయుధమాత్ర ద్వితీయులును.

రామ—త్వరగఁ బ్రవేశ పెట్టుము—

సేవ—చిత్తము (నిష్క్రమించును)

(తిమ్మప్పనాయకుడు గోపానాయకుడు—వరవరనాయకుడు.

చిన్నప్పనాయకుడు.)

(రామరాజెదురేగుట అన్యోన్యవందనములు సంతర ముపవిష్టులగుట)

రామ—ప్రభువులారా! మీమీసైన్యములకును కోటలకును మహామ్మదీయుల వలన నెట్టిసంకటములును కలుగవుగదా?

సీ. కొండవీఁడును పెనుగొండకున్గిరియునా
నందమే తిమ్మప్ప నాధనీకు
విద్యానగరరాజ్య విభవసామ్రాజ్యము
క్షేమమే నరవరభూమినాధ
మెచ్చనైదగిన మీకొచ్చికోఁడెల్ల
హాయియే యొప్పుచిన్నప్ప నాధ
సకల బాహాప్రౌఢిఁ జతురుండవగు వేల
నామయం బేగోప నాధనీకు

గీ. సర్వసామంతమకుట భాస్వద్వినూత్న
రత్నదీధితి పాద విరాజితుండు
విభవజితపురుహూతుండు విజయనగర
పాలభానుండు క్షేమమే ప్రభువులార!

ఏమి పలుకరు, సాళువవంశపయః పారవార రాకాసుధాకరుండును, అచ్యుతదేవరాయల కొరనుండును నాకు ముద్దులబావమరదియు నగు వెంకటరాజునకు సేమమేకదా?

గోప—హా—రామరాజా! యింకను వెంకటరాజునకు సేమమడుగుచుంటివా?

సీ, మృదువులై బాల్యసంపద తేటనీటులై
గిల్లఁబాల్గారు చెక్కిళ్ళవాఁడు

చిరునవ్వు వెన్నెలల్ గరము దీపింపంగ
కలకలలాడు మొగంబువాడు
విచ్చిన తామర విరులసరపు గొనని
తళతళలాడు నేత్రములవాడు
బాలుడైనను పగవారిగుండెల జల
జలమనిపించు రాజసమువాడు

ఆ. వె. ముద్దుమాటల నెల్లరమోదవార్ధి
దేల్చివైచెడివాడు నిందితుఁడు కాడు
పటిమమించెడి నాజానుబాహువులవి
రాజిలెడివాఁడు వెంకటరాజు లేడు.

రామ—హా—హా—యిదేమి—వెంకటరాజు—లేడా? ఇక్లేల?

నర—మ—కసుమాలంబగు నీచవర్తన మమ్ముగా గారించి రాజ్యార్థమై వ్యసనంబున్ గొని పర్వమీడ్చికొన భావంబందె యోచించిదో ర్వినరత్వంబునఁ గూల్పఁజాలక భయోద్రేకంబునన్ గుందిదా విసమున్ బెట్టి వధించె బాలుని మహాశోర్యున్ తిమ్మడక్కృతఘ్నుఁడై.

రామ—హా! నఖదీ! వెంకటరాజా! (కనులుమూసికొనును)

తిమ్మ—రామరాజేంద్రా!

ఉ. పాపులమేము నీపలుకు బాటిగనెంచక దుష్టుఁడైనయా
భూపునిమాయవాగురుల పోడిమినీగతి దెచ్చుకొంటిమూ
పాపని గోలుపోతిమి కృపాలురలో తలయెత్త లేక నీ
పాపునఁ జేరినార మెటుపాలనఁ జేసెదవో కృపాగ్రణీ?

రామ—అయ్యో! యిట్టి దుస్తంత్రమునవధింపఁ బనుదుపని కలనైనదలంపనైతినే. కుమారా! రూపజితమారా!

ఉ. కూటికిలేకనే పరులకొంపకుఁ జేరితినన్న వాక్యమి
న్నాటికటంచు రోషమునవేడిచివచ్చితి యాదవానికో

హాటకతుల్యరూప ! సుగుణాఢ్య ! నిరంతనిరంతచింతలో
నాటి యాంతరం బమరనాయకు పీఠము నెక్కుచోయు తే,

నీవు లేని విజయనగరమేల నష్టైశ్వర్యయుక్తమగు రాజ్యభోగమేల? ధర్మసంస్థాపనానియుక్తంబగు దానాదికత్యాగంబేల ? ఈప్రపంచముపై యనురాగంబేల ? హా ! మఱంది ! వెంకటరాజా !

ఉ. సూరిమనంగినట్లు కసుచూలపువృత్తికిలొంగి మున్ముదూ
ర్వారుగట్టడే విజయరాజ్యము సర్వము తిమ్మరాజు నా
నారభసంబుగాదొకొ జనంబులమానసము ల్గదిల్చి నే
పేరడిన్నతి నట్టు లరివీరులనోర్చెదగీర్తిగాంచెదన్

వెంక—అన్నయ్యా : సర్వజ్ఞుండవగు నీవిట్లు విచారంబుఁబూని నట్లు? ముమ్మంరితురుమ్క-ధాటీవ్రవాహంబునాపు టెట్లు ? హిందూ రాజ్యస్థాపనావిషయైకదత్తులమగు టెట్లు ? విషపరిత్యక్తప్రాణుండగు వెంకటరాజువిషయమై విచారింపకుము. అనాధలై తెరవరయలేక కర్తవ్యతామూఢులైన యీసామంతులకేదియోని ధైర్యోపదేశ మొనర్పుడు—దుర్మార్గుఁడగు తిమ్మరాజును వధింపుము—బాలునియాత్మకించు కశాంతిఁజెందు నుపాయమాలోచింపుము.

శా. క్రూరాత్ముండగు తిమ్మరాజును రణక్షోణిఁబడఁగూల్చి పా
పారంభుల్యవనాళిశీర్షములనార్యావర్తదేశాంగనా
హారంబట్లురచించి భారతుల యాహారావముల్మాన్చి నీ
యీరాజ్యంబుసమస్తమేలుకొను మిక్లేలామదిఁగుందగాన్

ముందుసాళువవంశాంకురవిచ్ఛేదనాపాటవకుతారుండగు తిమ్మరాజువధ కర్తవ్యము. లెమ్మాలసింపకుము—నీయాజ్ఞకై నిరీక్షించునీసామంతరాజులకించుక నాజ్ఞనొసంగెద వేని—

ఉ. ఏమగునో విషంబుల మహీస్థలిఁగూల్చెడిబాలఘాతుకుం
డేమగునో పతివ్రతలనెల్లదహించెడిమ్లేచ్ఛకేల లిం

కేసుగునో స్వదేశమునకే వెనరేసెడిమూఢబుద్ధి నీ
వే మదినచ్చెరుంబడెద నెంతయు మెచ్చి పొగడ్తలిచ్చుచున్

అన్నయ్యా ! యూరడిల్లుము.

రామ—తమ్ముఁడా :

చ. కలకలలాడుబాలుని మొగంబుగనుంగొనఁజాలనంచు లో
బడలెద తండ్రిలేని పసిపాపనికీనుఁరవస్థవచ్చెనం
చులికెద సాళ్వవంశము విశుద్ధము నాశనమయ్యెనంచు నే
కలఁగెద సర్వమున్విడువఁగాఁదగునంచును బల్కెదన్ జామీ.

నర—(అను) ఈయనఘునిమన సూరడిల్లునట్లు తోచదు. కావున నెల్లనిశౌర్యరసోద్రేకునిగనొనర్పవలయు. వెంకటరాయా! నీవేసమర్థుఁడవు. "వజ్రంవజ్రేణభిద్యతే" యివ్వు పూనుకొనకున్న నెట్లు ?

వెం—అన్నా ! వైరులవధించి తత్పవిత్రరక్తమున వెంకటరాజునకు తర్పణవిధిజరిపి పిదప ప్రపంచము నిష్కంటకముగొనర్చి నీవన్నట్లు సర్వమును బరిత్యజించుట తగుఁగాక. ఇట్లధీరోచితంబులగువల్కులఁబల్కుటతగునా ? పరాక్రమవంతులు " శావమఱఁదినిజంపిన పగతునేమియుఁజేయఁజాలక యనాథయట్లు రామరాజూరకున్నాఁడను నపయశస్సు భరింపసాధ్యమా ? నీకయ్యరి విషయమై భయముదయించిన (అర్ధోక్తి)

రామ—ఆ ! తమ్ముఁడా ! పరాక్రమహార్యత్వుండగు రామరాజు నంతటియధమాధముఁడట్లు తలంచితివా?

ఉ. ఘోరతరాహవస్థలినిఁ గూల్చుటొ లేకరిచేతగూలుటో
భారతవంశజాతుల స్వభావము నన్నిటులాడజెల్లునే
క్రూరునివాని దుర్భరవిఘూర్ణితమద్ఘనఖడ్గధారకున్
బారణజేసియో పృథివిఁ బాలనజేయుటొ బాయుటోయగున్

(అందరు, జయము రామరాజా? జయము రామరాజా.

రామ—ఓవీరవరులారా !

ఉ. లెండిక మీరు గాక ప్రమథశ్రీముఖపంక్తుల నూరికొంచు పా
పుండగు తిమ్మరాజునయుఁ బోకుడు జేరుచు శూన్యమధ్య మా
ర్తాండుని క్రీవ సర్వము యథాయథమైజనుఁగాక రామరా
జుండెభయంబునీకుడు మహాహాద్భుతి భారము నే వహించెదన్.

తత్క్షణము విజయనగరమునకు సర్వసైన్యముల సంసిద్ధముఁజేయుము.
వెంకటరాజా ! నేనే సేనాపతినై ముందునడచెద—వైరినడఁచెద—

వెం—ధన్యులమైతిమి. రేపే ప్రయాణమని చాటఁబంపెద—

(లోపలఘంటాధ్వని)

వెం——వేళయైనది. ఘంటారావము వినవయ్యేడి. పోయి భోజ
నానంతరము సర్వసన్నాహముననర్చెదను.

(తెరపడును)

(2 వ రంగము-విజయనగరమందలికోటలో నొకభాగము—సలకము
తిమ్మయ్య ప్రవేశము.)

సలకము తిమ్మయ్య—హా ! నాప్రయత్నము లన్నియు
నిష్ఫలములైనవి. రామరాజునకు సామంతులకును నిష్కారణవైర
ముఁగూర్చితిని. సైనికులనెల్లర నావడిలోవైచుకొంటిని. ప్రపంచ
మంతయు నువ్వెత్తుగ కబళింపఁజాలు సుల్తానుల నావశంగతులఁగావిం
చుకొనుప్రయత్నముల సల్పుచుంటిని. నారలన్యోన్యద్వేషయుక్తులగు
నప్పుడేకీభవింపఁజేసితిని. క్రూరకృత్యమనియు జంకక పసిపాపనికు
త్తుక విసముఁబోసి వధించితిని. నేనేరాజునని ప్రకటించితిని-పగరహాసిం
చితిని-హితులమెప్పించితిని-సంతసించితిని.—అయ్యో !!నాదురుద్యోగ
ములన్నియు నెంతలోసమకూరి, నన్నానంద వార్ధి నోలలాడించెనో—

ఇప్పుడప్పాపఫలమంతజవమున నన్వధింపఁజొచ్చుచున్నది. కర్తవ్యమెట్లు?

సీ. సామంతులెల్లరుఁ జని రామరాజు పా
దంబులపై వ్రాలఁ దలఁచుటేల?
పూర్వవైరము నెంచఁబోక ప్రేమభరంబు
ముంచ వారలనాదరించనేల ?
సర్వసైన్యంబుల సమకూర్చుకొని రణా
వనికిసిద్ధంబయి వచ్చుటేల ?
ఒకడైన నామాట నొప్పక వైరులం
జేరనైనాతల మీఱఁగ నేల ?
గీ. కాలమిటు పాశమైనాడు కంఠసీమ
జుట్టుకొనియాడ్చుచున్నది సురపురముకు
పాపఫలమిట్టులనుభవ భావమయ్యె
వగచినఁబ్రయోజనంబు లవంబుగలదె.

హా! హా! మృత్యుదేవతా! నన్వరింపనే తెంచితివా ? గడియకిందవిజయనగరసామ్రాజ్యపరిపాలనాదక్షుఁడనని యుబ్బిపొంగారుచుంటినే-యింతలోనింత చేటలమూడవలయు-అయ్యో ! నేనవ్వారల చేఁజిక్కిన కత్తికొక కండగ దినమునకొకయవయవముగ వధింపకుందురా ? ఛీ! ఛీ! దుర్మార్గులగు వారిచే నేల మృతిగాంచవలయు! చిత్తసన్న్యాసంబున నింద్రియములబంధించి ప్రాణాయామమున మహాయోగీంద్రులమార్గమవలంబింపదఁగాక-(ఆలో)ఛీ! యిదేటివెఱ్ఱి "జీవన్భద్రాణిపశ్యతి" యనునట్లు బ్రతికియున్నచో నేనాటికైనఁ గష్టములు గట్టెక్కి సుఖపడుయోగముండిన భార్యాపుత్రాదులతో యథేచ్ఛముగా కాలముగడుపవచ్చు నిష్కారణముగఁ బ్రాణములనదలనేల? రహస్యమార్గమున నాకున్న సర్వస్వమునుఁ గైకొని కుటుంబయుక్తుఁడనై బీజపురమునకటిగి సుల్తాను నాశ్రయించి విజయనగరముగుట్టుమట్టులఁ జెప్పి నా వైరుల మదమడఁచె

ద—సుఖం చెడ. (చిటికవైచుచు) బీజపూర్ సుల్తానంతటివాడు చేతిలో నున్న యిప్పుడు యీక్షణమున- విజయనగరవిధ్వంసము—యెప్పుడో యననేల చాకన్యులసహాయమేల ?

గీ. పూర్వమొకకోతి లంకను బూదిఁజేసె
నిపుడుతన్నామమేవహియించినాఁడ
నగుటవిద్యాపురంబు వినాశనంబు
జేతునొకరెండు కొఱవులఁ జేతబూని. (చిటికెలువైచి)

కుమారా !

(కుమారుడు ప్రవేశించి)

కుమా—తండ్రీ !యాజ్ఞయేమి ?

తిమ్మ—మనగూఢచారులసిరువురంగొని మీయమ్మతో మనకున్న సర్వస్వమును రెండుగుఱ్ఱములపైనునిచికొని మనపెరటినుసరించినగూఢమార్గమున బిజాపురమునకరుగుడు—సర్వమును గోప్యము-

కుమా—నాకు చెప్పవలయునా ? విషయమింతకుముందేబోధమైనది. సర్వసన్నాహముఁ జేసితిని. మీరు త్వరలో కలియరావలయును.

తిమ్మ—తుంగభద్రానదిదాటకముందే— ఇదిగో ప్రొయిలోనికొఱవులరెండుదెచ్చియిమ్ము-యీరయాశేషమునిర్వర్తించుకొందు.

కుమా—(తెచ్చియిచ్చి) జాగ్రత్తగా ప్రవర్తింపుడు-

తిమ్మ—(గైకొని) షేష్ షేష్ హనుమంతా-ధీమంతా-బుద్ధిమంతా—రమ్ము. నాయందావేశింపుము. క్షణంబున విజయనగరము ముటడింపుము. ఓయీ రామరాజా !

ఉ. నేడిటు పెత్తివచ్చితివి నిశ్చయబుద్ధివధింపనన్ను నీ
కోడితినన్న దుర్యశ మహా భరియింపగ నేలనేను నా
పోడిమి జూపుమియ్యనలభూమిక నెత్తితి సర్వశూన్యమౌ
బూడిదమేనఁబూసికొని పొమ్మియ భేచ్ఛగ యాదవానికిన్

నాపైఁగత్తిఁగట్టి రామరాజునకుసాయపడు దురాత్ములగు సైనికులారా! పౌరులారా!

గీ. ధనకనకవస్తువాహనతతిసుతస
తీసబాంధవ యుక్తులై తీరరాని
పావకజ్వాలలందున భస్మమైన
శించి నల్లులవలె మాడి చెల్లిపొంత

ఇదినాయాదేశము—

(హారాహ రాహ రాహ రాహ రాహ రాహా రా) (అనిపాడును.)

జేయ్‌భద్రకాళీ—(కాల్చుచు నిష్క్రమించును)

(తెరలో) హా! ఇదేమి మహాగ్నికీలలు! ఓవిజయనగరవాస్తవ్యులారా!

గీ. కొఱవిదయ్యంబుఁబోలె దిక్కులమహాగ్ని
రేపి దహియింపుచుండె నీపాపియెవఁడొ
రక్షకుఁడు లేమి సర్వమార్తానినాద
మాపఁబడుసాధనము యెందుదోపదకట. .

యెచ్చటికై నఁబరు వెత్తుదు. చేతనైన నుదకముఁగుమ్మరింపుడు-మీమీ ధనగోపశుసతీసుతుల ప్రాణముల రక్షింపుఁడు—

(విజయనగరపరిసరారణ్యము. రామరాజాదులు ప్రవేశము.)

రామ—మిత్రులారా!

మ. చోరకారన్ నిమరించు బాలుని గతాసున్ జేసి నిశ్చింతరా
జ్యరమానందముఁజెందనెంచె గద కట్టా దుష్టుడాతిమ్మఁడే

నరపాలుండు సహించుఁ డీనివిని మన్దప్రజ్ఞుఁడౌ వానిదు
శ్శిరమున్ గోయక నేలఁగూల్పక యశశ్శ్రీఁ బొందక వ్వారిగాన్

నర — రామరాజేంద్రా! సర్వసైన్యములును వానిస్వాధీనమం దుండుటఁ జేసి మా కేపనికిని యదను దొరకినది కాదు. మొట్టమొదట బాలుని వధించిన పాపాత్ముని జాడయే యెఱుంగ లేకుంటిమి "తిమ్మఁడో, పైకిమాతోఁ గలసి వగర్చుచు తుదకు నరాజకమగు విజయనగరమును నేనే, పాలింపవలసివచ్చినదికదా యనితన మనోభావమును తగునట్లు జతపరచె. మాకుఁ గొంచెము సందియముగనుండునంత వాఁ డెందో జనియె నప్పుడు విశ్రాంతిగ మేమాలోచించితి మంతలో విషప్రయోగము జేసినవాని రెండవపహరాజవాను గ్రహించి మా కడ కీడ్చికొనివచ్చె వాని నోట సర్వమును విశదమయ్యె ననంతర మాతనివధింతమన్న సైన్య సహాయుఁడగు నాతని ప్రస్తుత మెదిరింపనోడి దుఃఖమున కర్తవ్యతామూఢులమై నీకడ కరుదెంచితిమి. లేకున్నచో,

గీ. పట్టివధియించినట్టి యీపాపకర్ము
బట్టివధియింపకుందుమే పామరులమె
శౌర్యమే కాలిపోయెనె సైన్యహీను
లమగుట నేమి జేయఁ జాలమియె గాక.

మాయందింతయు దోషంబు లేదు.

రామ — కాలమీరీతి దీర్పఁజెందుచుండ మాకట్టిబుద్ధియేల జనించును? నలహరిశ్చంద్రాది భూపతులకేని యీకాల భ్రమణము నతిక్రమింపఁజాలకకదా, కట్టడిపాట్లకులోనైరి. సర్వసర్వంసహా పరిపాలనాదక్షుఁడును, విజయనగర సామ్రాజ్యోద్ధరణమునకు కూకటివేరును — పరవీరులగుండెలలో శూలమును, మిత్రులకుఁ దలలోని నాల్కయు నగు తిమ్మరుసంతవాని నేత్రముల కృష్ణరాయనిచేఁ బెరికివేయించినది — హా-ఆసుగుణాత్ముఁడు మాకై అస్థిమాంసములఁ బరిత్యజించి యీనా

గరము మ్లేచ్ఛులపాలఁబడకుండఁ గాపాడి యిప్పుడు బృహస్పతికి విద్యలు నేర్పనరిగినట్లు, స్వర్గపురమునకుఁ జనినాఁ డమ్మహాపురుషుఁడే జీవించియుండిన నీరాజ్యమున కింతటి చేటువాటిల్లునా?

శా. రాజ్యంబెల్లనుమంత్రిశాస్త్రగతమై రాజిల్లునామంత్రిస
ద్వ్యాజ్యాంధ్రెఁ జెలంగు సేనియెడ విశ్వస్తంబెచేకూరున
ట్లాజ్యంబగ్నిఁబోయురీతినిటు తిమ్మామాత్యునిన్ మెచ్చియున్
బూజ్యాంబీపదవీయనిట్లమరె నంధుండద్దమెట్లట్లుగన్

ఛీఛీ వానిమాటఁ దలపెట్టిన నాకుసర్వావయవములు నగ్గి వ్రేల్చినట్లున్న యవి. వాఁడు ఘాతుకుండగు రక్తసిక్తమై భూమిందొరలాడు వానిమూర్ధమెప్పుడు కనఁజాలుదు. నర హరిరాయా. విజయనగరంబింకెంత దూరముకలదు.

నర—అదిగో సమీపించితిమి కోటశిఖరద్వయము.

రామ—(తేఱిపారఁజూచి) హా! ఆనుంటలేమట్లు ప్రళయకాలాగ్నింబోలె శిఖావిస్ఫూర్జితమై మాటిమాటికి మింటి కెగయుచున్నవి. ఆ.

తిమ్మ—ఇది తప్పక యరణ్యమునందు జెలరేగు కార్చిచ్చని నాయభిప్రాయము.

నర—కార్చిచ్చుఁబోలెఁదోచదే! హా మాగ్నింబోలె నొకరీతి మండుచున్నయవి యేమావిస్ఫులింగములు.

(భటులుఇద్దరుమాఱువేషముతో ప్రవేశము.)

1 భటు—అయ్యా! మా దేయూరు.

నర—ఓరీ యేమట్లాత్రి వచ్చెదరు. మీరెచ్చటనుండివచ్చుచుంటిరి

2 భటు—మేమా--(సంశయింతురు.)

నర—భయములేదు. నిజముఁజెప్పుఁడు.

1 భటు — అయ్యా! మీరెవరో ముందుగఁ జెప్పినఁగాని మాస్థితిఁ జెప్పఁజాలము.

2 భటు — (చూచి ఓ పెద్దమ్మా! మా రాజు రామరాజుగారేరా?

1 భటు — (చూచి అమ్మయ్య బ్రతికితిమి. దొరా. (పాదములబడి)

శా. దుర్మార్గుండగు తిమ్మరాజు ఖలులిందర్యాన్ బాలునిం జంపి మా
కర్మంబో యన పట్టణంబు హతమున్ గావింపగా కీలలన్
నిర్మానుష్యముఁ జేయుచుండె పిక నెందేనిన్ దలం దాచనై
యోర్మిన్ దాపుచునుంటిమో ప్రభువ మమ్మెట్లో బ్రోవ యోజింపవే.

రామ — హా! క్రూరకర్మా! యెంతనీచమునకొడిఁగట్టితివి! సర్వము హరింప బాలునిఁ దుదముట్టించిన కట్టడి వీపసి కేటికి సమకట్టితివి? రాజ్యమునిచ్ఛానుసారముఁ బరిపాలింపకుంటివా? నీకు ప్రజ లేమహిత మొనర్చిరి?

2 భటు — దేవా! వానియుద్దేశమిది,

శా. సామంతుల్ మిముఁ గూడివచ్చి తనపీఠంబార్తరంబెంచి మీ
రేమో సర్వముకట్టుకొందురని కార్చిచ్చిట్లు ముట్టించె నం
గ్లో మా బిడ్డలు తల్లులంగనరు తల్లుల్ బిడ్డలం జూడ కా
యామార్గంబులఁ బట్టినారమిటు దేవా! బ్రోచెదో వీరలన్.

అయ్యా! వృత్తాంతమిది. మీరుత్వరగ నేగుదెంచి పురమార్చి ప్రజలరక్షింపకున్న విజయనగరము క్షణమున విధ్వంసమగును.

వెంక — శా. ఆలస్యంబొనరించ నేటికిటుల న్నాకీల లేయున్న నీ
లీలన్ సున్నరుసున్న హాళ్లి కని హాళ్లి గాక వేఱుండెద
ప్డేలా కాల్ప నిసైన్యముల్ మనబలాభీష్టంబులున్ భూరిశ
స్త్రాళుల్ పౌరుషయుక్త వాక్యములు నిస్త్రింద్రప్రభావంబులున్

కావున నాలసింపక బ్రయాణగమనమును త్వరఁ జేయుఁడు.

రామ—ఓ స్వామి సైనికులారా! మీరా కాలిమార్గంబునంబడి పరుగువారి త్వరగ విజయనగరముఁ బ్రవేశించి పావక హేతింబడి భస్మమగు సర్వమును సంరక్షింపుడు. మీ ప్రాణముల పైనించుక యునాశింపకుడు. మీకు నాసోదరుఁడగు వెంకటరాజాధిపత్యము వహించును. త్వరగపొండు—తమ్ముడా యాలసింపకుము—మేము త్వరలో మిమ్ము గలసికొని తగినంతసాయ మొనర్తుము. తిమ్మనిఁ బ్రాణములతోఁ బట్టుడు.

వెంక—చిత్తము—(నిష్క్రమింతురు.)

రామ—భటులారా! మీకు పలకము తిమ్మయ్య యెచ్చటనున్నదియుఁ దెలియదా?

భటు—అయ్యా! వాఁడప్పుడె పారిపోయెనని దెలియుచున్నది.

రామ—సరియె. వాని వెదకిపట్టి తెప్పించుటకును కొందర నంపవలయు. త్వరపడుము. (నడతురు) (తెర పడును.)





# రామరాజు.

(ఫాలాఫ్ విజయనగర్)

## ద్వితీయాంకము.

(ప్రవేశము రామరాజు వెంకటరాజు సామంతులు)

రామ—(సింహాసనాసీనుఁడై) సామంత ప్రభువులారా! పుర మంతయుఁ జక్కఁబడినదిక దా? దరిద్రులగు వారికెట్టి లోపమునుఁగలుగనీక తగినట్లు దారుపాషాణాదుల నొసంగి శిల్పుల రావించి కట్టడము లెట్లట్లమర్చితిరిక దా? ఆహారపదార్థముల కుందెట్టి సంకటమును ప్రజలనుభవింపకుందురుగాక—

వెం—అన్నా! సర్వమును బాగు జేయబడినది. పౌరులమస్థితి యంతయు సౌఖ్యముగ బరిణమించినది ఇఁక రామరాజ్య మకుటకోటి నందియుమః?

రామ—తమ్ముడా! అట్లుకాదు. సదాశివరాయనిఁ బిలిపించి అమ్మహానీయుని రాజ్యాభిషిక్తునిగ జేయుట నాయభిమతము. దీనికి నురల నెవ్వరును విపరీతముగ మాటలాడి విజయనగరమున కెట్టి యిక్కట్టునుఁ గలుగనీయకుందురని నాయభిప్రాయము.

(సేవకుడు ఆషాభినిఁ బ్రవేశపెట్టును)

సేవ—రామరాజేంద్రా! నమస్కారము.

రామ—ఓయీ! యీ కాంత యెవరు.

సేవ—మొన్నటి రాత్రి బాహుదండమాత్రులో నొక మ్లేచ్ఛసంపన్నుని యింటబడి సర్వమును హరించి మరలునప్పు డీకాంత యొకగదిలో మంచముపై శయనించి సుఖింపుచుండగ గాంచి దేవరవారికీ స్త్రీరత్నము తగునని గైకొని తెచ్చితి నంతవరకీలతాంగి శీలము చెడియుండలేదు. కాని,

ఆ. వె. భక్తిగొనవిమానోట సూక్తి యొసంగను
గాంచవోరులమోము లెంచబోదు
కష్టసుఖములెట్టి కాంతయోగాని మ
హమ్మదీయ జనులపై రహిఁ జెలుంగ.

హిందూనామస్మరణమున పండ్లు పటపట గీటునట్లు ధ్వనివినిపించును. దేవరవారిచిత్తము.

రామ—నారీమణీ! నీ పెప్వ రెవ్వ.

ఆషాభి—నేను మహమ్మదీయవనితనని యీవరకీ సేవకుడు చెప్పినాడుకదా మరల నేటికడిగెదరు? నిండుసభలో నన్ను మాటాడించి పరాభవించుటకా ?

రామ—ఓహో!

క. కూపస్థితమండూక
వ్యాపారంబట్లదోచు నారయ మునుగన్
దీపింపలోనమాటల
నేపుట తలనెత్తి పల్కవే కుద వెందవుగా.

మాటాడించుటే పరాభవమా! అబ్బా! యెంతనీతి!

గీ. ముసుగలంకారమసి లోనముడియుంబోకు
గుణమలంకారమగు కాంతకును ధరిత్రి
"ఘోష" యనువెఱ్ఱిఁగోడ నాఘోషపడుటె
కానిమప్యాంత నాఁపగా నానెచెపుమ!

కావున ముసుగుదీసి నీసుందరవదనారవిందమింత మాకనుదోయికి విందొనర్పు నించుక మాటలాడుము.

పతా—(స్వ) హా! యిదెంతటి విపరీతము. నేనీహిందువులఁ గొల్చుచు మాస్వకులస్త్రీలనిట్లవమానించు దుష్కృత్యముల చూచి సహించి శఠించవలసి దేవా! హా! మహమ్మదీయకులమా! నీకెట్టి గతి పట్టినది.

గీ. అలమహమ్మదుగోరియునక్బరును స
లావుదీనారంగ జేబె విశేష
ముఁ నెసంగిరి తుదకు దుర్బలులగాంచి
నిలువబోవె మహమ్మదీయులకులంబ!

సీ. లక్షలకొలఁది హింపూక్షేత్రముల నెల్ల
నిలమసీదుల జేసి నిలిపినావు
పరమశోత్రియులైన బ్రాహ్మణబృవులను
సాహెబులట్లుగా సల్పినావు
అధికంబులైన దవ్యాగారముల నెల్ల
స్వీయదేశంబును జేర్చినావు
స్నానదానాదినిష్ఠల నేర్చునా హిందు
కాంతలకు నిఖాలు కట్టినావు.

గీ. చివరకెచ్చోటినుంటి వాసీవిమంబు
వోలె తలకెక్కి మమ్మిట్లు మొనరుపంగ

కనికరింపవు వచ్చి పావనులమైన
మమ్ముఁబ్రోవవు దీనికేమాత్రమైన
ప్రతిఘటింపవు దెల్పు మా ప్రభువ ! అల్ల !

ఆపా—(స్వ) యీప్రక్కన నెవఁడో నన్ను నీచుడాడుమాటల
కించుకగినిసి నట్లు సూచింపుచున్నాఁడు. మహామ్మదీయుఁడైయుండవ
చ్చు హిందువుఁడైన మరింత ప్రోత్సహింపఁడా! దురాత్ములు నవ్వుచు
న్నారు. ఈవికటహాస మెందుకొఱకో.

రామ—ఏమీపలుకవు. ఓరీ సేవకా ! పూర్వము పతివ్రత
లగు మనహిందూస్త్రీల నవమాన పరచిన తుచ్ఛమ్లేచ్ఛవంశజాతమై
నగర్వియగు దీనిమేలిముసుగుఁదీసి వేయుము.

సేవ—చిత్తము—(అని ఆపాభిముసుఁగుదీసి వేయును.)

ఆపా—(ముసుగుదీసి) ఓరీ ! మూర్ఖుడా ! రాజరూపఛండా
లుడా !

ఉ. రాజవుదుర్మదంబున పరాంగనమేలి ముసుంగుదీయు నీ
యోజహరింపజేయదె యయో ననుబోలుసుతల్ సహోదరుల్
పూజితులెందు లేరె దయపొందదె దీనల నేచుపట్ల నీ
రాజరికంబు కాల్పనె భరంబగు భూమికి నీవు దుష్టుడా !

సీ. లలితపతివ్రతా తిలకమానలు రాణి
బూతులాడిన యాకిరాతుభంగి
సీతామహాదేవిఁ జెరగొని నీచముల్
బలికినయట్టి రావణునిభంగి
పాంచాలికట్టువల్వలు నిండుకొల్వున
నొలిపించినట్టి దుర్యోధనుగతి
సురనరయుతు కిన్నర కాంతలనుచెర
నలిపిన హిమకశ్యపుని భంగి

సీ. నన్నునీగతి సభలోన నవ్వులాడి
దుర్మదోద్రేక సంరంభ దుర్భరుడవగు
భంగపఱచితివింక నీపాటుగనుము
విజయనగర విధ్వంససంవేద్యదీక్ష

పఠా—(స్వ) మేలుమేలు! యెంతకాలమునకు కర్ణరసాయన
ములగు నీపలుకులాలింపనయ్యె, ధీరులగు మహాత్ముదీయ పురుషుల
నోటరాకున్నను మాకులమున కలంకారప్రాయయగు నీకాంతవలన
వింటిని. ధన్యుడనైతిని. దీనికెంతయు సాయమొనర్తును.

ఆషా—మావంశీయులగు పూర్వులు మాపనితల నవమానిం
చిరని వారిని దూషింపుచు నీహీనకార్యమున కెట్లంగీకరించితివి. పాపా
త్మా! మహాపతివ్రతల పరాంగనల నేచుపాపము పామువిషముకన్న
జవశక్తితలకెక్కి త్వరలో హరించును. త్వరలో నీకును నాగతియె పట్టం
బోవుచున్నది.

గోపా—రాజేంద్రా! యిదెంతయు నకృత్యము. ఇంతటనైన నీమెకు బోనను జ్ఞనొసంగి యీమె యంతఃపురమున తగినంత గౌరవ
మొసంగి రక్షింపుచుండునట్లనుగ్రహింపుడు.

గీ. కడుపులో మంటరేగి నీగతిశపించ
కులమెదైనను సాధ్వియే యులుకుచుండె
శోకదగ్రోక్తియన పాము దంష్ట్రికరాళ
వదనమునఁబడపీక దే వానివెంట.

పఠా—(స్వ) బాగుగాపలికినాడి కాంతమాటలు విన్నది
మొదలు దీనియందనురాగము హెచ్చుచున్నది. నేనింతవఱ కవివా
హితుడనుకదా? ఇదియు నట్లైయె యుండిన స్వీకరించిన నింతటివీర

రసోద్రిక్తయు సచ్ఛీలయగు ధర్మపత్నిలభించెడి యోగముపట్టిన నె క్కత్రుటిలో నీరామరాజును వధింపనా ?

రామ—సేవకా! వీనింగొని చని గోపనాయకుని వాక్యముల ల్లంతఃపురమున దెల్పుము. ఈతుచ్ఛమ్లేచ్ఛ శాపముమాటవిడిచి మీ రిందాకటివినయమై నిజమువచింపుడు.

తిరు—దేవా! క్షమింపుడు. మీమాటలఁ దిరస్కరించియే చివరకీనగరమున కిట్టి దుస్థితిఁ దెచ్చుకొనిరి. కాని, యీసామంతులయం దెవ్వరును సలకము తిమ్మయ్యంబోలిన దుష్టుఁడు లేఁడని నేనునమ్మెద. కాని, యీసామంతుల యభిలాషఁబట్టి మిమ్మొక్క కోర్కెఁ గోరుచు న్నాఁడను. మీకిది యంగీకారమైనను బ్రస్తుత మనంగీకారమైన నాచ రింప వేడుచున్నాఁడ—

రామ—మీకు కష్టమగునట్లిప్పటికిని బ్రవర్తింపను.

ఉ. చాలునుపొమ్ము రాజ్యపు విచారణ మానుచు మాదవానినే
యేలుము లేనిపోని పనులేటికి నీకని పల్కఁ జుట్ట ప
క్కాలనుపీఁడి మిత్రులకు కన్గొనలందున నీరుగూర్చి యా
బాలుని ముద్దునెమ్మొగముఁ జూసి యధేచ్ఛఁగఁబోవలేదొకో.

నర—మహారాజా! యేటికీగతజలసేతుబంధన...

ఉ. నాపలుకాలకింపు కరుణామయ పోయినవెల్లఁ దప్పి సం
తాపముఁగూర్పఁ బోకుము గతంబుగతంబు యశంబు నిల్ప ఫ
ప్రాపునుఁజేరి మ్లేచ్ఛులవిపాకముఁ గోరెడి మాకు శౌర్యవి
ద్యాపటిమంబు నేర్పవె సుధారసమొల్కెడి చిల్కపల్కులన్.

రామ—నేనంతవఱకాలోచింపలేదు. మీయభిప్రాయమున కిట్టి సంకటసమయములందైనఁ దిరస్కరింపను. అందులకుఁ బ్రమాణముఁ జూపితిని నాపలుకులకు మీమానంబుల సందియమందరని తలంచెద.

గోపా — రామరాజేంద్రా !

క. నీవే పరిపాలింపుము
భూవలయం బెల్లనట్లు పొసఁగిన యాత్మబలక్ష
పూర్వపుతాతయుఁ గలసిన
తేనజగము వర్ధిలుఁగ గనిందిగరిమచేన్ .

ఇది సర్వజనసమ్మతము. మీరిందులకు సంశయింపకుఁడు.

రాము— అయ్యో యిదెట్టికోర్కె ?

ఉ. సాళువవంశజాతుల వశంకర మీయఖిలంబు నారలే
యేలుచుఁ జెల్లుఁగాక తగునే యిటు రాజ్యముఁ గట్టికొంట పా
పాలకుఁ కళంకమగు ఫక్కియెగాక యశంబు నిల్చునే
కాలుఁడు తప్పుతెలముఁ గొల్పడె మీరిది మెచ్చఁజెల్లునే.

అట్లుగాదు. సదాశివరాయని రాజుగఁజేసి నేను మంత్రిపదవిఁ బూని యథేష్టముగఁ బ్రజలనోమెద నరులదునుమాడెద.

సరి — మాయాశయము నిర్వర్తింపుఁడు.

గీ. వేరుగల్గుసదాశివ విభునిఁగూర్చి
దలచుటది కష్టసాధ్యమైదనరుగాదె
చేతివానినిఁబోనాడి చింతఁగూడి
కాలివానికిచేజాచు కరణిగాదె.

ఇట్లు ప్రజలనేకులు నొడువుచున్నారు. ప్రజాభిప్రాయమునకు వ్యతిరిక్తముగ పూర్వులయందెవ్వఁడును బరిపాలింపలేడు.

చ. ప్రజలకుసౌఖ్యమైన గతి పాలనఁజేయుట లొప్పు రాజు లా
ప్రజలకు కష్టమైన తనరాజ్యముగీర్తియు వంశమంశముల్
నిజధనధాన్యముల్ యశము నీరధిలోనమునింగిపోవు గా
న జయముగోరువాఁడు తననవ్యపదంబును నిల్పుకోఁదగున్

ప్రజలయభిప్రాయమే రాజులకు సర్వసంపత్కరము. సత్యమైన నస త్యమైన బహుజనాభిప్రాయము. శ్రేయము.

గీ. ప్రజలయభిలాషఁ బోదోలుపట్టుఁబట్టి
దశరథేశుండు తగ కాలధర్మమందె
ప్రజలయభిలాషఁ బోదోలిపట్టుబట్టి
మాయదుర్యోధనుఁడు మటుమాయమయ్యె.

కావున రాజనీతి సర్వదాప్రజానందదాయకమైయుద్ఘోషించుచువిరాజిలుం గని ధర్మములు జెప్పనంతవారము కాము. మహారాజా! సర్వసరళం సహాపరిపాలనాదక్షుడవును, బలహార్యత్ముడవును, అగునీవీవిజయనగర సామ్రాజ్యము పరిపాలింప—

చ. మును నొకరాముఁడేలె నటు భూమిని సర్వము "రామరాజ్య" మం
చును వచియింప నిప్పుడు విశుద్ధుఁడు రాముఁడు "రామరాజ్య" మం
చన పరిపాలనన్ సలుపవయ్యె "బళీ" యని మెచ్చి సౌఖ్యమున్
గొనుచును నిద్రవోయెదరు గుండెలపైఁ జెయివైచి నీప్రజల్.

వెం—అన్నయ్యా! యీసామంతుల కోర్కె సిర్వర్తింపుడు సర్వధర్మవేదివి. సకలప్రజారంజకుఁడవు. సత్వ్వభావ్రఁడవు. విజయనగ రసామ్రాజ్యలక్ష్మి నీ భుజస్కంధములపై హాయిగఁ దాండవమూడ నువ్విళ్లూరుచున్నయది. (అవవారించి)

క. "సిరిరామా కాలొడ్డెడి"
నరుమాడ్కిని రాజ్యలక్ష్మి నారతమునిర్మన్
వరియింపఁ దలచియుండఁగ
దురూహాలిటుఁజెంది తొలఁగఁద్రోయందగవే.

కావున వీరిపల్కు లవశ్యానుష్ఠేయములు.

ఉ. పూనిక రాజ్యకాంక్షమెయిఁబూర్వపు రాజులెయస్థిమాంసముల్
బ్రాణములైన నిచ్చి దురుపాయములైన సహించి పాపమే
యైన వధించి బంధుగుల పార్శ్వమునీఁగ నేలిరీధరన్
గాననిటేల సంశయముఁగాంచెద రేదియు లేనివానికై.

యెట్టికష్టమును లేక తనంతవఱించి వచ్చిన రాజ్యమును తిరస్కరింపఁద గునా ? ఒక వేళ నిది దుష్పథమైనను. "రాజ్యాంతే నరకంధ్రువ" మ్మనుమాట యన్యథాకానేరదు. అదియుఁగాఁక—

రామ—(అప) చాలుచాలు. తమ్ముఁడా ! చక్కఁగ యుపన్య సించితివి. అయ్యో ! సాళువవంశమునకు క్రమాగతమై సంక్రమించు చున్న యీవిజయనగరమును "తద్వంశ సంజాతుఁడు రాజ్యాధికారా ర్హుఁడుండ మనమెప్పటికైన నాక్రమింపఁజెల్లునా— ఇదిలోకమున కెట్లున్నను పరమందైన భగవంతుడు శిక్షింపకుండునా ? ఇందించు కంత లోపము ప్రజలకు గల్గించో మననెంతగతిట్టిపోయుదురో యా లోచింపుము—

వెంక—(అప) ఇదియా మీసందియము.

రామ—తమ్ముఁడా ! నీవు వేయినుడువవలదు. సామంతులా రా ! నిన్న సలకముతిమ్మయ్యను బట్టి తెచ్చుటకును, సదాశివరాయ లతో నీవార్తఁదెలిపి వారిని రమ్మని చెప్పుటకును మొన్న చారులనం పితిమికదా ? వారలు వచ్చిన వెనుక కర్తవ్యమాలోచింతము.

నర—(అప) (వెంకటరాజుతో) వెంకటరాజా ! శ్రీమధురాపుర మునకు సదాశివరాయలకొఱకై బంపబడిన దూతతో బహుతాత్పర్య ముగ బోధించి పంపించితిని. మన కార్యమెట్లైన గట్టెక్కును.

సేవ—(ప్రవేశించి) అయ్యా ! చారులిరువురేతెంచి ద్వార మునకడనున్నారు. ప్రవేశపెట్టఁదగునా ?

రామ—రమ్మనుము

సేవ—చిత్తము. (నిష్క్రమించును. చారులు ప్రవేశము.)

చారు—మహారాజా! సమస్త నదీనదపురనగరజనపద వాపీకూప తటాకారణ్యగిరి గహ్వరముల నంతట వెదకితి మెచ్చటను నలకము తిమ్మయ్య జాడయే లేదు.

రామ—ఆహా! "శత్రుశేషం శేషయేత్తు" ని కదా! సరియే విజయనగరానలము జీవించియేయున్నది. తరువాత.

నర—మహారాజా! సంశయింపకుడు. వాడు నల్లివలె నా మహాగ్ని కీలలందెప్పుడో భస్మమై యుండవచ్చు. వానివిషయమై విచారింపకుడు.

చారు—పిదప మధురాపురమున కరిగి సదాశివరాజును సందర్శించితిమి. విషయము సర్వమును నివేదించితిమి. బాలుని మరణంబునకును, విజయనగర వినాశనమునకును కొంతతడవు పరితపించె ననంతర మీమహాగమన విషయమున కానందించి తానిప్పుడే వచ్చెదననియు నామమాత్రమే నుండెదను. మా మేనల్లుడగు రామరాజును న్యాయముగ బ్రజారంజకముగ బరిపాలింపుమనియు వచించె—

నర—(తనలో) ఇక తప్పదు.

వెంక—అన్నా! సందియమెందుకు? భగవత్సంకల్పమంతయు నేకీభవించినది.

నర—ఇక తప్పదు. రామరాజేంద్రా! మీరు రేపే యీవిజయనగర సామ్రాజ్యపీఠమునధిష్ఠింపవలయు.

సామం—నరవరనాయకునిమాట లవశ్యానుష్ఠేయములగుగాక.

రామ—మీమనోభీష్టప్రకార మీసింహాసనమలంకరించెదను. సర్వజనులయానతి శిరసావహించెదను.

అందరు—ధన్యోస్మి ధన్యోస్మి—

(తెరపడును.)

(వెంకంభొట్లు పాపావధానులు విద్యానగరవీధిని ప్రవేశము.)

వెం—అవధాన్లుగారూ! యీమధ్య బొత్తిగా దర్శనాలు లేవు. ఇప్పుడు మకామెక్కడ.

పా—యేతచ్ఛత్రాలు యేతత్సామగాయకమైపోయినవి. సంభావనల సంబరం అడుగంటింది. దీనిదుంపతెగ—ధనుఃపుష్య మిప్పుడే ప్రారంభమైంది. మొన్నటిదాకా శుక్రదర్శనము కాలేదుకదా?

వెం—బుర్రిలో అక్షింతలు బుగ్గైపోయినవా యేం దర్భాసనపు దడదడలతో పాతపన్నాల పండ్లికిలింపుతో యెవడినెత్తినో రెండుగింజలు వేసి తలకొకనక్షత్రం చొప్పున శనివలె వేధించిగుంజుకోగల సామర్థ్యవంతుడవు బీదపల్కులు పలుకుతావేమయ్యా!

పా—శరీరంలో రుగ్మతయేర్పడినది. నైజాంనీళ్లంటె బొత్తిగా గిట్టవు. ఆదేశంపోతేనేగాని ఆగతంగాదు. ఎన్నేంచావమంటావా?

వెం—నైజాం అంటే జ్ఞాపకం వొచ్చింది. మొన్న మీమేనత్తకొడుకుమీద పెద్ద కేసొచ్చిందట క్షేమందా వ్యాజ్యం.

పా—చెప్పుకుంటే అప్రతిష్ఠ. నీకడుపులోనుంచుకొనుము. వెధవసన్యాసి చిన్నతనంలో అక్షరంముక్క చెప్పుకొని దోషానికి హైదరాబాదులో శవవాహకత్వానికి కుదిరాడు. “బిచ్చమెత్తుకున్నా మేలు రాలేనిపోనినింద మెడకు చుట్టుకుంటుందని” నెత్తినకొట్టుకొని కొట్టుకున్నాను. విన్నాడుకాడు. ధనాశ నాయనా ధనాశ—

వెం—విషయం చెప్పవేం.

పా—ఆ. తరువాత వ్యాపారులపీనుగనుకంట్రాక్టుగా మాట్లాడుకొని పాతికరూపాయలు వళ్లో వేసుకొని తమజట్టు నలుగురుకలిసి తీసు

కొనిపోతున్నారట పోతూవుండగా మధ్య వైశ్యులెవ్వరును వెలుపలలే నందువల్ల నాయింటిముంగిటనాశవమునుజడపై చితలకొకదిక్కుగపరుగె త్తినారట అంతటవారుపనిమీద వెలుపలకువచ్చి చూచేసరికి గుండెలు పగిలిపోయి యిదేమికర్మమని యేడ్పులుబొబ్బలురొమ్ముబాదులు దిమ్మ వాదులు నానాగందరగోళం; అసలైవైశ్యులు. దానిలోపీనుగ. తమవా కిట్లోనే. గుండెలుపగలడమంటే సామాన్యమా, కాకిగోల. తరువాతవి చారించిచేయునదిలేక—

వెం—అసలువ్యాపార్లకు తెలియలేదా.

పా—అంతపట్టంలో యెక్కడకబురు. యెవరిమాటయెవరికి తె లుస్తుంది తరువాత మళ్లీమోతవాండ్లకోసం చూస్తూవుంటె మనవాండ్లే పరిత్యక్తమైనారు. సరే; మళ్లీ పాతికె.

వెం—(నవ్వుచు)వీండ్లదుమ తెగ; మంచివృత్తిసంపాదించారే.

పా—అంతటవ్రాసుకుంటే నయమే. మళ్లీరెండుమూడుకొంప లకిట్లాగెఅంటించారట. యెన్నాళ్లబట్టి యిట్లాగడిస్తున్నారు.

వెం—యెన్నాళ్లబట్టిగడించంది మీవాడునిరతురకుట్టి పాల ఘాటుపిల్లకుపదిహేనువందలుపోస్తాడు. నివు నేను యింతచదువేసిస్తే. పగలుచస్తేవాతికి. రాత్రిచస్తేదీపానికిలేక యేడుస్తూన్నాము. తరువాత.

పా—గిట్టనిముండాకొడుకెవ్వడో యీకిటికుబాగా కనిపెట్టాడు పోలీసువాండ్లతో చెప్పేడు. వాళ్లదుంపతెంచాడు నాయనా మూడునె లలైంది ఖైదులోనేసర్వం నైజాంకమకమ తేలుతుందా యేడుస్తుండాయే దో విధంగా వాడిపీనగలడబ్బేపదివందలున్నాయి యెట్లాగోవదిలించు కోద్దామంటే వీలాలేదు.

వెం—బాగావున్నది అడగమఱచాను నాకీకర్ణాటకదేశముఃబా త్రిగాగోలగావుంది నిన్నప్రభువుగారింటికి బండ్లమీద బడి గుఱ్ఱముల

మీాద రథములమీాద ద్విరదములమీాద అభ్యాయిసు కేస్పీరాలకుండాజ నంపోతున్నారు లోపల యేషుపులుజాస్తిగావున్నవి కారణమెవరు చెప్పలేరు. వూరల్లావుడికిపోతున్నది కారణంయేంటి.

పాపా— సరె యిదినీకు తెలియనేలేదా. పాపము రామరాజు గారికి లేక లేక నొకపిల్లవాడు పుట్టాడు. వాడిదుంపతెగ బ్రతుకనిబిడ్డ కాటెడన్నట్లు యేమిపిల్లవాడయ్యా కోటిసూర్యులకాంతి పాపమునాతొత్తుగానన్ని పాతరోగముతో సమికాడు. ఆలగోడు బాలగోడు.

వేం—శివశివా రామరాజెంతటి యోగ్యుడు! మహారాజు బ్రాహ్మణభక్తి దైవభక్తి తగినయుక్తి, మృదులసూక్తి ఆహా! అంతటివానికిరాదగినకష్టముకాదు. పాపము ఒక్కగానొక్కపిల్లవాడు.

పాపా—యేంచేస్తాడు యిచ్చినదైవంతీసుకపోయినాడు.

వెం—వట్టిది యికరామరాజుగారి రాజ్యపరిపాలన యిటులనే కరకుతురకల జుట్టుపన్ను కట్టుపన్ను బొట్టుపన్ను అయ్యో హిందువులెంతయానందముతో కాలము వెళ్లబుచ్చుచున్నారు. ఇకదుర్దశరోజులొచ్చినవి. మనము మరంగట్టాల్సిందె.

పాపా—అంతయెందుకు చచ్చిననాటిదుఃఖము మఱునాడుంటుందా! మెల్లిగాఅదేమాసిపోతుంది వెంకంబొట్లు రెండుజాములైంది యెక్కడాయివ్వాళ శ్రీవణ లభించలేదు. కొంపజేరు నాము పద.

వెం—సరే ఆమూలగొందిలో ఒకవర్తకుడు శాస్త్రతర్పణమువిడుచుకుంటానురమ్మన్నాడు యీనాటిపోరైనా వెళ్ళిపోతుంది

పాపా—యెరగనట్లే సంపాయిస్తున్నావు అసాధ్యుడవుసరె పద.

(ఇద్దరునిష్క్రమింతురు)

(విజాపురము)

(ఆదిల్షాహి ఆసనోపవిష్టుడై విచారించుచుండును)

ఆది — హా దైవమా! యీహిందువులచే నెంతకాలమీ మహాద్దశననుభవింపఁ జేసెదవు? యెంతకాలమీ సుల్తానుల నతిహేయులగతి నేడిపించెదవు! అయ్యో! రామరాజంతటనీచహైందవప్రభువు మమ్ముఁబోలు సుల్తానులతనచేతికీలుబొమ్మల యట్లాడింపుచున్నాఁడే. మా పూర్వపరాక్రమమును ఐకమత్యమును హిందూమతద్వేషమును స్వమతాభిమానమును స్మరించినంత గుండియలు పగిలి వ్రీలి జారలి తెరలిమరలిపోవుచున్నవే. మాలో మాకు లేనిపోనికల్లోలములవల్లనే యింతయూడినది. నాబుద్ధిచాకచక్యమును విద్యావైశద్యమును సుల్తానులకైక్యమందు వయోగింపకున్నదికదా! (తలయూఁచి) కానిమ్మిప్పుడొకింత ధైర్యముఁ గలుగుచున్నది.

గీ. విజయనగరసామ్రాజ్య సద్వృక్షమునకు
వేరుపురువట్టులే తెంచె వీరుఁడొకడు
వీనిసాహాయ్యమునధృతి బూనికోట
గుట్టుమట్టులఁ దెలిసినే గూల్చివైతు.

వైరియెడలపరాక్రమముఁ జూపి ప్రాణములు నొప్పజెప్పుటకన్నలొంగి నట్లునటించికుయుక్తిచే గూల్పఁజూచుట రాజ్యతంత్రము. బలమున నొకపట్టణము సాధించుట కెంతకాలమొ పట్టె కుతంత్రముచే భరతఖండమంతయు నొక్క క్షణమున నాక్రమింపవచ్చు. నాకిప్పుడీ సలకము తిమ్మయ్యసాయమున్నదికదా? వీనుమంచి ప్రజ్ఞకలవాఁడు మాయమంత్రము లెఱింగిన యింద్రజిత్తు కాని వీనిని నమ్మవచ్చునా నమ్మరాదా అనుసంశయము విచారింపఁదగియున్నది. వీఁడు కాఫర్! వీఁడికి పట్టుదలయెందు కులాభిమానము లేదుస్థలాభిమానము లేదు. ద్రవ్యాశపెట్టిన త్రివ్వితలకెత్తికొనును పోస

మనున్న సమ్మానవారల మూకు చెరుప్ప ప్రయత్నించిన కలుషుండే కాని మ్ము. వీనికి గురుమాత్రమే చోటు సంగిజాగరూకత సర్వావసానముఁ జేల్పెద. ఓరీ యెవరురా!

జవా—హుజూరు మహారాజ్

ఆది—నిప్పు త్వరగా జవా సలకము తిమ్మయ్యను రమ్మనుము.

జవా—(తనలో) యీ మా యదార్థ భొమ్మన్ సైతాన్ లాగా తగిల్పించుకొన్నాడు. పిల్ల లేక తల్లి లేక సచ్చిపోతుండాగ క్యా ఫాయిదా హాంజే మర్గయా సేస్తాడేమో హాంకు క్యాక్ పరి చిత్తం మహారాజ్

(నిష్క్రమించును)

ఆది—వీనిం జేర్చుటవలన మహమ్మదీయులకు కంటకముగనున్నది. ఏది యెట్లున్నను,

గీ. లేనిపోనియనుమానముల్ బూని కార్య
హానిఁ జేయంగఁ దలపఁగా నగునె చెరికుఁ
బిండిరసమునుఁ గొని యంతఁ బిప్పిఁ బార
వైచినట్టుల వీనిని వదలవచ్చు.

ఇది రాజనీతికితగు తెరంగు వీనికివిజయనగరముపైఁ గొందరు స్నేహితులు కలరనియు, నారలవలన నేనాటివార్తలానాఁడు తనకు దెలియుచుండుననియువచించెఁగదా? వీనివలననె సర్వఫలములుఁ జేకూరును.

(సలకము తిమ్మయ్య ప్రవేశము)

తిమ్మ—సలాం మహారాజ్

ఆది—దయచేయుండి పొద్దుననుండి కనుదర్శనమే లేదు.

తిమ్మ—చిత్తము మనకొకసంతోషవార్త యీనాఁడు వచ్చినది దానివిమర్శనలోనుంటిని.

ఆది—మీ రెప్పుడు మా పట్టణముఁ బ్రవేశించితిరో యానాఁడె సంతోషవార్త — యానాఁడే శత్రువంశచ్ఛేదము — సంతోషములేని దెప్పుడు!

గీ. చంద్రుఁ డుదయించినప్పుడే చల్లదనము
గలిగి సంతోషసౌఖ్యముల్ వెలయఁ జేయు
భానుదర్శనమున ప్రకాశించలగుచు
మాయచీకటులన్నియును మాయునేల.

మంత్రివర్యా! మీ సంతోషవార్త వినఁ గోరెదను.

తిమ్మ—దేవా! మీకు నాపై నింతయనుగ్రహమున్నందు కెంతయుఁ గృతజ్ఞుఁడ. నేటియుదయమున విజయనగరమునుండి నామిత్రుఁ డొకఁడు లేఖనంపినాఁడు. దానియందలి విశేషమిది రామరాజు ప్రియనందనుఁడు పరలోకగతుఁడైనాఁడట ఇది మనకు సంతోషవార్త యేకదా?

ఆది—పట్టపుదేవియగు తిరుమలాంబకు ఒక్కఁడే కొడుకున్నాఁడు. వాఁడు కూలుట మన కెంతయు నుపకారము.

గీ. తనయుఁడీల్గెనటన్న సంతాపమునను
రాచకార్యముల్ మదిదోఁచక వి
రాగివలెఁ గూరుచుండును రామరాజు
మనకు మిక్కిలి యదనగు రణముఁ జేయ.

తిమ్మ—అమ్మా! వానినంత వెఱ్ఱిగఁ దలంపవలదు. పైవచ్చు వానిసైన్యమును, దండనాథులును, సామంతులును, నిజభుజవీర్యవశీకృతదిగంతరులు, విద్యానగర సామ్రాజ్యమునకు తమరక్తము నర్పింప సంసిద్ధులైయున్నారు. రణమునకిప్పుడేగా దెప్పటికైన నశక్యము.

ఆది—(తన) యీతఁడేదియో కుతంత్రముఁ బన్నుకొనియే వచ్చినాఁడు. నామాయోపాయములచే పొంగించి రాదీసెదఁ గాక (ప్ర)

మంత్రిపుంగవా! అట్లయినచో మన తాపసిస్త్రీని మరణమునం గలుగు విశేషమేమి ?

తిమ్మ—(తన) యాతఁడు నన్ను మహామాత్యమణీ మంత్రివరా! యని సంబోధించుటచే నాకంతటి మహాభాగ్యము లభించునా యని సందియముఁ బొడముచున్నయది. మొన్ని రోజులనుండి నామనోగతాభిప్రాయము వెల్లడించుదమన్నను అదను దొరకకయున్నది. పైపెచ్చు నిరాశ్రితుఁడనగు నన్నీతఁడు తిరస్కరించిన నాగతి యేమగును ? చెట్టుగుట్టలఁ బట్టిపోవలసినదే కదా ? రామరాజు కంటఁబడిన సున్నము నకెముకనున్న యీయనుమానమే బాధించుచున్నయది. యెట్లైనను మార్పులేని దాపరిక మెందు కడిగియే తీరెదను.

గీ. విజయనగరపుగుట్టెల్ల వెళ్లఁబెట్టి
కపటమున రామరాజును గలచి రాజ్య
మేలఁదలఁచిన నాకిటులేల చల్ల
కనుచుఁ జనుదెంచి ముంత దాఁచినవిధంబు.

కావున నాకోర్కె వెళ్లఁబెట్టెద యిదే యదను.

ఆది—(తన) యీపిశాచ మేదో యాలోచించుచున్నది. (ఆలో) సరిలే తెలిసినది. దీనిచే వీనిని మెప్పింపవలయు. (ప్ర) తిమ్మయ్యగారూ! మీరు వచ్చినప్పటినుండియు మీకొక విషయముఁ దెల్పవలయునని యున్నది. మీరెట్లైనను విజయనగరరాజ్యము జయింపఁజేతురేని మీకే యీ రాజ్యసర్వస్వము నొసంగి మాకంకితుఁడవుగఁ బరిపాలింపఁజేతు. దీననా కేమిఫలముగలదందురా? ప్రక్కలోనిబల్లెమట్లు మహమ్మదీయుల కాజన్మశత్రువులును దురహంకారపూరితులును దుర్మార్గులగు విజయనగరప్రభువులు వినాశమందుటయు నిన్నుఁబోలు బుద్ధిమంతుఁడును హిందూమహమ్మదీయ కులద్వయ సమ్మేళనావిచక్షణుఁడునగు

మహాత్మ్యము బరిపాలించుటే మాకు సర్వసౌభాగ్యము. శ్రేయము. నాకోర్కెయిది. మీయిష్ట మెట్లు ?

తిమ్మ—(తన) అబ్బా వీనికెంత వేగుకలదు. నావిషయము నేఁ జెప్పకొనకపూర్వమె గ్రహించి తనమనోద్దేశము బయలుపఱచినాఁడు

చ. పనివడివీనిరామనరపాలుని సన్నిధికంపి "నీదునం
దనుడు గతించె వానికయితద్దయు నేర్చినలాభమేమి న
న్ననుగొనరాదె పుత్రునిగ నాకఖలంబును మీర" లంచు బ
ల్కనటులఁ జేసిమైత్రి నెడగూర్చియనంతరమెట్లొ చేసెదన్.

యితిమంచియాలోచనము (ప్ర) అదిల్ఖా—ప్రభువరా! నామాటవినుము. నీచమని తిరస్కరించినచో కార్యభంగమగును.

చ. పనివడినీవు రామనరపాలుని సన్నిధికేగి "నీదునం
దనుడుగతించె వానికయితద్దయు నేర్చినలాభమేమి న
న్ననుఁగొనరాదె పుత్రునిగ నాకఖలంబునుమీర" లన్న ప
ల్కనువచియించి మైత్రినెడఁగూర్చుకొనందగుదాన మేలగున్.

పిమ్మటనేను సుల్తానులందరకడకరిగి వారలమైత్రిసంపాదించి విషయము బోధించి సఖ్యమొదఁగూర్చి యుద్ధమునకుఁ దెచ్చెద నీవు సైన్యయుక్తుడవై రామరాజుపక్షము వహించిరమ్ము. సంగరమధ్యమున వెనుకనుండి నీవు విద్యానగరసైన్యమును విధ్వంసముఁ జేయుచుండుము. ముందు సుల్తానులసైన్యముచాకకోతఁగోయుమని శ్రేష్ఠుఁడగు రామరాజును క్షణమున యమపురికంపఁగల మింక నిందనేక సూక్ష్మము లిమిడియున్నవి. అప్పుడు సర్వమునుమనకైవసమగును. మహారాజా మీసంతోష కాలమున నామాటమఱవకుఁడు.

ఆది—(తన) ఆహా వీఁడెంతమాయదారి. వీనికడుపులో నెంత యాలోచనాతరంగములుకల విట్టివాఁడగుటనే సామంతులఁ దనవశం

గతులుగఁ జేసికొని సైన్యమును చేపట్టి రామరాజును వెడలఁగొట్టినది ష్టి కాని దైవప్రాతికూల్యమున కేమి చేయఁగలదు ? విజయనగరము నో్ర తిలకింబోలె కాల్చినాఁడు. దానఁగూడ ఫలము లేకపోయినదిప్పుడీయోచన సమంజసమే కాని యీనిదురాశ విజయనగరము పరిపాలింపవలెనని యున్నది. పనియైనయనంతరము యమనగరమే పరిపాలింపఁగలఁడు.

తిమ్మ—ఏమో యాలోచింపుచున్నారు. నామాటలయందు పాటవము లేదనియా ? లేక నీచునట్లాశ్రయింతుననియా ? పగతుని పంచఁ జేరుట భావ్యము కాదనియా ?

ఆది—అయ్యా !

సీ. నీచుంబనక రాచనీమముఁ బోనాడి
వానిగెల్చుటకు బోవలనుగాక
పోయిన దుఃఖముఁ బోకార్చినావయిఁ
గూర్మిఁగల్గ దిప్పికొందుఁగాక
కూర్మిగల్గిన సర్వకువలయంబును నేన
భరియింతునని భ్రమఁబరతుగాక
భ్రమగల్గినను యుద్ధపటిమంబునకుకోట
వదలి రానైజత పఱతుగాక

గీ. యెన్ని చేసినసుల్తానులున్న పగలు
మఱచి యైకమత్యంబునబరగి యుద్ధ
యాత్ర కేతెంచి జయమంది యశముఁగాంచ
బూనుకొనెదరనుట కలలోనివార్త.

తిమ్మ—యెంత వెఱ్ఱి నే జెప్పిన ట్లొనర్పుము పైభారమంతయు నాది. రేపే కుతుబ్షాకడకుఁ బ్రయాణము. నా చాకచక్యముఁగనుగొమ్ము. నీవసియందు నివప్రమత్తుఁడవైయుండుము. మధ్యమధ్య వచ్చిపోవుచుం

కుము. కొన్నికొన్ని సమయముల జరుగవలసియున్నవో తగువానికి నిపమా నాము కావలసియుండును రామరాజన సామాన్యుఁడు కాడు మాయ మంత్రముల నేకము లెరుఁగు. ఏదియెనను మొగమందుఁగాని చేష్టలయం దుఁగాని నీభావమించుకయు దోపనీయరాదు. ఎవ్వరికైన నీమనోనిశ్చ యమెఱింగింపవలదు. నీయిష్టము.

ఆది——సరియే వేళయైనది. పోదము రేపు మాంటు నేనిటు.

తిమ్మ——చిత్తము.

(తెరపడును.)





# రామరాజు.

## తృతీయాంకము.

---

(విజయనగరములో సింహాసనోపవిష్టుడై రామరాజును ఆదిల్షాహి
యు తిరుమలదేవయు.)

ఆది— నాయనగారూ! యేలవిచారమందెదరు.

ఉ. ధారుణిఁజావుపుట్టుకలు తద్దయు నిత్యము మానవాళిక
ట్లారసిచూడసర్వము మహాద్భుతమై దనరారుచుండు సం
సారము ఘోరమింతయును సారములేదిటు మీరు నక్కటా
తీరనిదుఃఖమేటికి గతించిన పుత్రునిఁ దేగలారమే.

రామ— నాయనా! నిజమే కాని పుత్రదుఃఖమువంటిది మఱి
యొండు లేదు.

తిరు— హా కుమారా!

చ. కడుకొని సర్వసంపదలుఁ గల్గిన సౌఖ్యములొప్పియున్న గం
పెడు బలగంబు చుట్టు పరివేష్టితమై హితమైనవాక్యముల్
నొడువుచునున్న దుఃఖము వినూతనమై గననొక్కదాన నొ
క్కడయిన పుత్రశోకము వికారముఁ జేయదె సర్వజీవులన్.

తిరు.—హా! కుమారా! నా కింతటి దురవస్థఁ బట్టించితివిరా!

చ. వయసుఁగలంచె దేహమురవంతయు వార్ధక్యయుతమ్ముఁగాను నీ
కయి మది గుందికుందె యెటుగా నశియింతుమొ యంతసిట్లనా
మయమయి వంశమెల్లఁ జనుమాటయుటుంచి కృతార్థమైన స
త్క్రియలకు నోచకుంటిని భరింపఁగ శక్యముఁ గాని దుర్విధిన్.

ప్రద్యో: తండ్రీ నీముద్దులూరురూపమిఁక నీజన్మమునఁ జూడఁ జాలముకదా!

సీ. ఘలుఘల్లుమనిమ్రోయు గజ్జెలచిరుమ్రోత
గమనంబునకువింతగతినిఁగూర్ప
తళతళలాడునేత్రముల బెడంగులు
కర్ణములకునూత్నకాంతినింప
పలపలలాడుసవ్వుల వెన్నెలలు దిక్కు
లశ్వేతదీధితులనుసమర్ప
కలకలలాడు మొగంబు సౌందర్యంబు
పరజనాకర్షణభావమొప్ప

గీ. వెడదయురమును బాహులపొడవు రాజ
వంశచిహ్నంబుఁదోప భాస్వంతుదీప్తి
నలరునీవిట్లు మావంశ మడఁగఁ జేసి
పోయితే సురపురిఁ జూడ పుత్ర! నీవు

హాతనయా! యింక మేమెవ్వనిఁ గాంచి యూరడిలఁగలము.

ఆది.—అమ్మా! చింతిల్లకుము విధిప్రాతికూల్యమున కేమి చేయఁగలము! పూర్వజన్మకృత పుణ్యపాపముల ననుసరించి సర్వమును జరుగుచుండును దీనిఁదప్పింప నెవరు కర్తలు! పూర్వము యముండు చెప్పిన సుయజ్ఞోపాఖ్యాన మింత యాలోచింపుఁడు దుస్తరమైన దుఃఖము

గా తల్లులయింపుచున్నప్పుడు కలుగక బంధుమిత్రాదులు పరివేష్టించి తనసర్వసంపదల నానందించునప్పుడు చెలంగక ప్రాణాపాయకరమైనను దుష్టవర్తనల నెలంగక రామున్నవిధానమునకు దొలంగక ధైర్యమున నిలిచిన సత్పథగామిగదా యుభయలోకపూజ్యుఁడుగదా!

ఉ. చావులుపుట్టువుల్ మనుజసంతతికిన్ సహజంబులంగుటన్
జావునకేడ్చి పుట్టువుకు సంతసమంది చరింప జెల్లునే
చావకయుండఁగా మనమసాధ్యము జీవులరాకపోకడల్
భావమునం దెఱుంగుచుఁ బండితుఁడీగతి లెక్కఁ జేయునే.

తిరు— నాయనా! యెంతయోర్చియుండమన్నను.

ఉ. ఎవ్వనిఁ జూచి సర్వమిత్రుఁడే పరిపాలనఁ జేయఁ జెల్లునం
చువ్విళులూరుచుంటిమొ వియోగమొకానొకయప్పు కల్గినన్
నెవ్వగఁ గుందుచుంటిమొ సునిశ్చితబుద్ధిని నట్టిపుత్త్రుఁడే
యివ్విధి పేరుబాయసిక నేగతి యోర్వఁగలారమక్కటా!

విద్యానగరవసుంధరాభారమంతయు నెవ్వని భుజస్కంధములపై నిలిచి తాండవమాడునని తలంచియుంటిమో సర్వసామంతకిరీటస్థితనూత్నరత్న ప్రభాజాలము లెవ్వాని పాదసరోజములపై వ్రాలియుండ నానందింప దలంచియుంటిమో, సకలారిసంఘాత శిరోవిచ్ఛిన్న స్రవితరక్తధారా సంయుక్తమగు ఘోరాసి యెవనికరంబున నలంకారయుతమై జూపట్టునని కొండంతయాసతో నుంటిమో! తన చేతిని నా ప్రాంజలుల మధ్యంశమంతయు దరింప జేయునని కనిపెట్టుకొనియుంటిమో యెవనిపావల ముద్దుముచ్చటకాలము దుఃఖమునదోఁగ్రించు దలంచియుంటిమో అట్టిపుణ్యములరాసి, మానోములపంట, మానయనకువలయశశి, మాముద్దులయ్య గతించెనా, యింకెట్లోపియుండగలము.

రామ— నాయనా! ఆదిత్యావా.

చ. బుడబుడవచ్చి “నాన్న యెటుపోయెను నన్నువిపోవరాదె ”యం
మ హగఇప్రేమఁ దాకరముంగా యవ్యాన నెత్తిన నెత్తికొని వా
ంబుజాత ! సుధీశ వంశనిధపూర్ణశశాంక ! యటంచు ముద్దుగా
డెను సుకుమారు కేళి నడిచితు తలఁచితు మహాఘదుఃఖమున్.

ఆహా —(స్వ) ఇకనీరులనావలఁగొ వేసికొనవలయు (ప్ర) తండ్రీ రామరాజేంద్రా! సర్వవేదివగు నీవే యిట్టి నీచదుఃఖమునకుఁ బాల్పడిన నోదార్చువారెవ్వరు ? వివేకమను చెలియలికట్టఁ దాటిన దుఃఖసముద్రము నెట్లు నివారింపనగును ?

సీ. అభిమన్యుఁడంత బలాఢ్యుండు చచ్చి
నఁ బట్టి తేగలైన ఫల్గునుండు.
సద్గురుకౌశికులు సుగ్గునూచకమైన
ధృతరాష్ట్రుడే ఢ్బాఁగా కేమిచేసె.
అష్టపుత్రుల పిటికర్ప్రా చెగాక చ
చ్చినవారితోఁ బోవగనె నె గంగ
పుత్రశతంబట్టె బుగ్గిపాలైన వ
శిష్టుని తపమేమి చేయఁగలై
ఆ. వె. ఎవరమెంతగనేడ్చిన నించుకేని
ఫలము లేదు రాగల కార్యభారమునకు
శిరమువంచి కాలము వెళ్లనరయవలయు
గాక, చనువారితోఁ బోవఁగలమె యనఘ.

నాయనా! మీరు విచారము మానుడు. నెలరోజులాయెఁగదా ? నేనేతెంచి యెన్నివిధముల మీమనస్తాపోపశమన మొనర్చుదమన్నను వినకుంటిరి మీరీగతి దుఃఖమునున్న మిమ్ముఁగాంచి నిలువజాల. నాకును బాల్యము నాగుండె లుపిరులుచున్నయవి తండ్రీ! నన్ను మీపుత్రుని

గ భావింపుము మీకన్నఁ గొమరుఁడు కన్న మీయందెక్కుడు ప్రేమనుంచు. మిమ్ముఁ గాంచుకొలది నాక దేమీయనిర్వాచ్యమగు పితృభక్తి యేర్ప డుచున్నయది. నాపలుకులయందావంతయు నసత్యము లేదు. అమ్మా! గతించినవాఁడే ఆదిల్షాహియనియు బ్రతికియున్నవాఁడే మీకొమారుఁ డనియు భావింపుము. నేను మీకు సర్వదా యూడిగముఁ జేయుచు మీ పవిత్రపాదాంబుజముల ధ్యానింపుచు కాలము వెల్లబుత్తు. నేను మహా మ్మదీయుఁడననియు మీరుహిందువులనియు భావింపకుము. మనస్సు ప్రధానముఁ గాని కులమెన్నటికినిఁ బ్రధానము కాదు.

సీ. పౌరాణికుని సూతభగవాను శౌనకా
దులు గురువనుచు పూజలు సలుపరె
సకల నీతికళావిచక్షణు విదురు భీ
ష్మాదు లివ్వారె సభ నాసనంబు
అతిప్రేమఁ నంగరాజ్యంబిచ్చి దుర్యోధ
నుండు కర్ణుని స్నేహ మొప్ప లేదె
శ్రీహర్షుఁడను రాజు చెలగి మాతంగు క
వియె యీతఁడని గౌరవించ లేదె

గీ. కులము ప్రాధాన్యమను మాటకూడదగయ
గుణమె ప్రాధాన్యమగును పావనులబుద్ధు
లెల్ల నీరీతిగా నెప్పె నీవు, నన్ను
బుత్త్రుఁడనియాదరించుట బోలదొక్కొ.

గుణదోషంబునఁ జేసి మహాత్ములనేకులు నేటివఱకు దురాత్ముల బహిష్కరింపుచునేయున్నారలు. నాయనా! నన్ను పుత్త్రప్రేమచే చూచుచుండు మిమ్ము సర్వవిధముల న్యాయముగ సర్వోపచార

ములఁ జేయుచు నాజీవితమును మీకై వినియోగించెద. నామాట వినుఁడు.

తిరు—(తన) ఆహా! వీఁడు మహమ్మదీయుఁడైనను యెంత సౌభాగ్యుఁడు! వీనివాక్యములు బహుజనసమ్మతములై స్వచ్ఛములగు గంగాజలములకన్నం బవిత్రములై దనర్చెడిని ఈపుత్రశోకసంక్షోభావేశ ప్రకాలమున వీనిసమాశ్వాసమెంతయు నొప్పియున్నయది. వీనిఁబుత్రుడని భావించుటె మేలు.

రామ—(తన) మేలు మేలు! మాకీదుఃఖకాలమున కేవలక అను తురకకులంబునఁ బుట్టినను వీనివాక్యములెంతయు మనోజ్ఞములైయున్నయవి. మొదటనుండియు వీనికి నాయందు భక్తికలదు సుల్తాను లందఱును నన్నుఁ దిరస్కరించినప్పుడు సైత మితఁడు తప్పక కప్పమంపుచు వచ్చిపోవువారలతో నాయుద్గుణములును నాయోగక్షేమాదికమును చక్కఁగ విచారింపుచు నాయందత్యంతమైత్రి గలవానివలె నడువసాగె నిప్పుడు ప్రత్యక్షముగఁ దార్కాణము తెలియుచున్నది.

చ. కొడుకుగతించినాఁడనుచు కుందుచునుండఁగ నొక్కఁడైన నిం
దడుగిడకుండిరా యపనులంతటఁ బోక మహాముదంబుచేఁ
జెలఁగుచు వేగఁ బండుగుల జేయుచునుండిరటంచు వింటి నీ
తఁడు ననువీడిపోవఁడు సుధారసమొల్కెడి ముద్దుమాటలన్.

ఈతని సమాశ్వాసమును వీనిభక్తియు నితరజనుల కలభ్యములు గతించిన సుతునికై యెంతయేడ్చినఁ బ్రయోజనమావంతయు లేదు రాజకార్యముల వీనిపైఁబడవైచి భగవధ్యానమొనర్చుకొనుచు కాలక్షేపముఁ గావించుకొనుచుండుట సర్వదా శ్రేయము.

ఆది—తల్లిదండ్రులారా! మీరు నన్ను విశ్వసింపకున్నను మీయడుగులఁ గొల్చుచు మీసన్నిధి యందే పడియుందు.

ఉ. వీడితి రాజ్యసంపదల వీడితి మిత్త్రులసర్వభోగముల్
వీడితిభార్యనైన నటువీడితి మాయతజాతిధర్మముల్
వీడితినింద్యకర్మముల నేనెవచింపఁగనేల నిమ్మనేల్
వీడఁగఁజాల మీపదములే నగణించిసి బోవఁ జెల్లదే.

మీపవిత్త్రమగు నంతఃకరణమునను కొంతయుఁ బాత్త్రుడనైనచో నిహ పరసౌఖ్యముల ధన్యుఁడనై మనఁదొద. తుచ్ఛమగు నిహసుఖము న్మాట యటుంచుడు.

చ. పరమున నన్నుఁగాంచి "యదెవచ్చెను జూడుఁడి యాదిరాజు" హా
పరహితుఁడీతఁడా పరమపావను శ్రీఘను రామరాజుకున్
గురుతరభక్తి నెల్లపుడు కూరిమిబిడ్డడటంచు మెత్తురా
సురలు మదీయరూపము విశుద్ధముగాంచిన వెంటనేదగన్.

అనుమానించెద రేల తండ్రీ! రాజు విష్ణుదేవుం బోలినవాఁడమ్మహాత్ము నియంశ లేక రాజై జనింపఁడుకదా? అద్దేవదేవుని యవ్యాజానురాగము కబీర్దాసాదులగు మ్లేచ్ఛులందెందఱిపైఁ బ్రసరింపలేదు! మీకు నాయందేల కరుణకలుగదు. అమ్మా! మీరు నన్నేడిననుఁ నేను మీపాదభక్తి వీడఁజాలను.—(నమస్కరించును)

రామ—కుమారా!

ఆది—ధన్యోస్మి ధన్యోస్మి.

రామ—కుమారా! నీయందు మాకెంతయుఁ బ్రేమజనించినది. నీవిది మొదలు మారాచకార్యములన్నియు నవరింపుకొనుచుండుము. మమ్మెల్లపుడును గొల్చిచరింపుము. నీకిష్టమైనభోగములను తలంపుము. మాసన్నిధి నిల్చి కాలక్షేపార్థమై ప్రసంగింపుచుండుము.

తిరు—అబ్బాయీ! గతము గతమయ్యె. గతించిన నందను జేతెంచుట కలలోనివార్త. వానికిమారుగ నిన్నుఁ జూచికొని కొంచెము మాకుమనస్తాపోపశమన మొనర్చుకొందుము. నీయిష్టమొచ్చినట్లు మా

తాపితృ పూజల నీజన్మధన్యముగ మాజన్మములు గణ్యములుగ మ
నకీర్తి జగన్మాన్యముగ నొనర్పుము.

ఆది—(తన) మేలు మేలు—నావిషబీజము వీరిహృదయ క్షేత్రి
ములయందుఁ జక్కఁగ నాటితిని యిఁక దానికి నీరుఁబోసి వృద్ధిచేసి త్వర
లో ఫలమనుభవించవలయు- జగముఁ దలక్రిందుఁ జేయఁగల నేనును
పదువాల్గులోకముల పటాపంచలు జేయగల సలకము తిమ్మయ్యయుఁ
దలంచిన పని వృథా కానేరదు. నాచాకచక్య మీ పైఁగాని సుల్తానులకు
తెలియదు. నానలనఁగాదగిన మహాసామర్థ్యాంశయు నికముందు
న్నయది—(ప్ర) తల్లిదండ్రులారా! (స్వ) యీనీచుల నెంతకాల మి
ట్లు సంబోధింప వలయునో కదా? కానిమ్ము (ప్రి) భోజనమునకు వేళ
యైనది లెండు పోదము (ప్ర)

గీ. పుణ్యమను బండిసాగిన నెన్నొ విఘ్న
జాలములు క్రిందఁబడఁ జేయు రాలు ల్లు
పాపపుంబండి పరుగెత్తబడిన వెనుక
జేరి నట్టుడివారె విశేషమవని.

ఇంక నాప్రియత్నము నిర్విఘ్నముగ కొనసాగును.

(అవనిక పడును)

(గోలకొండ కుతుబ్షా, సలకము తిమ్మయ్యయు నాసనోపవిష్టులై)

కుతు—తిమ్మయ్యగారూ! మీరుచేసిన పని యుక్తియుక్తముగ
నె యున్నది. కాని హుసేన్‌నిజాంషాపుత్రికయగు చాంద్‌బీబీని
ఎడిల్షా తనరాణిగా నంగీకరించునా? ఆతని చెల్లెలను నిజాంషాతమ్మున
కొసంగునా! ఆజన్మద్వేషులగు వారలకు మైత్రిసంఘటిల్లునా? నాకు
నమ్మకము లేదు. ఒకవేళ సౌందర్యఖనియు సద్గుణ గణధన్యయున

గు చాంద్ బీబీని వరించుట కతఁడంగీకరించు ననుకొందుము. తన చెల్లెలి ని ముర్తిజా కొసంగుట కలలోనివార్త.

తిమ్మ—అయ్యా! నామాటలవిశ్వసింప రెట్లుకొట్టుకొందు. సుల్తానులందరేకీభవించు విషయములో మాఆదిల్షాహ్ సార్వభౌముఁ డెట్టి దుర్ఘటకార్యములకైనను యెట్టిప్రాణోపద్రవములకైనను వెనుఁ దీయఁ దలఁచియుండలేదు. అయ్యో! స్వచ్ఛమగు మహమ్మదీయవంశ మందవతరించి పరాక్రమశౌర్యయుక్తుఁడై, యొరులకించుకయు జంకని వాఁ డిప్పుడు రామరాజంతటి కాఫరు నాశ్రయించి గులామట్లువాడిగ ములు చేయుటకైన మీరు యోచింపరా? మీకేటిసంశయము? కార్యములన్నియు భరింప కాలికి బలపముఁ గట్టుకొని కడలేని యిడుములకైన సహించి రేలనకఁ బవలనక మీముప్పురి చుట్టునుఁ దిరుగుచు సమర్థించువాఁడను నే నుండ ననుమానించెదరేల? యిదిగో నాసామర్థ్య మీనాఁడే మీకెఱుంగఁగలరు.

మ. జనుదెంతుర్నినుగూఁడ నిప్పుడె బరీద్షా యున్ నిజాంషాయు నౌ
యౌనమీముప్పుర కిప్పుడేఁ గలుగు నైక్యంబంత మీమీసుఖం
బును గష్టంబును వెళ్లఁబోసికొని రేపోమాపొ యుద్ధార్థులై
ఘనబాహాబలమొప్పఁ జంపుఁడి దెబీఁకన్ హైందవానీకమున్.

కుతు—ఆహాహా! మంత్రివర్యా? నీవింతసమర్థుఁడవని యెఱుంగ నైతి. వారలీనాఁడేవచ్చిరా? చెప్పవైతివి! తగిన ప్రయత్నము లేవి యుఁ జేయకనైతని మేలుమేలు నాకడకేవారే తెంచుటఁజేసి నాకెంతయు గౌరవముఁ దెచ్చితిరి. మీఋణమెట్లు తీర్చుకోఁగలను.

తిమ్మ—మీయనుగ్రహముండినఁజాలు! స్వల్పుఁడనైన నన్నింత గా నుతింపవలదు.

కుతు—మీబోటిఘనులట్లన చింతురు. ఓరీయెవడురా అక్కడ

జవాన్—ఆజ్ఞ బోలో జీ మహారాజ్.

కుతు—నీవు మన వజీర్ ఖానుతో అహమ్మదునగరసుల్తాను ను బీదరు సుల్తాను నిరువురి నాఁడే కొంతురు. తగిన ప్రయత్నము లొ నర్పుమని వచింపుము. పట్టణమంతయు నలంకరించుట, వారికి ప్రత్యేక భవనములు బాగుచేయించుట, పదార్థములెట్టికొఱంతయు లేకుండ సమకూర్చుట, మొదలైన పనులు.

జవాన్.—సిత్తం (నిష్క్రమించును)

తిమ్మ—మహారాజా!

శా. పాపిష్ఠుండగు రామరాజునకు భయభ్రాంతుండవై పాటిసం
తోషాంభోనిధిఁగూలిదాటుటకు తెప్పన్ గానఁగా లేకమీ
మీపాదంబులఁగొల్చుచీఁగతిని నామేధాప్రభావం బదే
తోపన్ సఖ్యముఁగూర్చినాఁడ నికగాదో శత్రునిశ్శేషముల్

కుతు—తిమ్మయ్యగారూ! మీప్రభావము వర్ణింప నశక్యము మూసాపైగంబరువు. ఆహా నీవలననేకదా! చిరకాలవిరోధమున నొక రి నొకరు వధించుకొనున తటి ఘోరవిరోధభావవికారుల మగు మేమం దరము నేకీభవించి తుచ్ఛమగు హిందూరాజ్యధ్వంసముఁ జేయఁగడగిన ది. నీమూలముననే కాదా? మహమ్మదీయప్రభువుల తనచేతికీలుబొ మ్మలకరణి నాడించు రామరాజు సతీసుతబాంధవ పౌరసహితుఁడై "నలోలక్ష్మణా" యని ఘోరారణ్యముల బరుగువారునట్టిస్థితిఁ గల్గినది. నిన్నుఁ గోటిబుద్ధిచాకచక్యముఁగలవాఁడొకఁడుండిన సామ్రాజ్య సంపాదన మొక బిచ్చగానికైనఁ గల్గును.

గీ. హిందువులయందు తంత్రజ్ఞులెందఱెంద
రో గలుగుటఁ జేసివిరోధిజనుల
బారిఁబడక తప్పించుక ఘోరయుద్ధ
రంగములనైన జయముఁగాంచఁగనుంట.

అబ్బ! కృష్ణదేవరాయని కవి కర్ణి మనుమని నా? మంత్రియగు తిమ్మరుసు బుద్ధివైభవమును స్మరించిన గుండె లిప్పటికి గడగడలాడుచున్నవి. పై తాన్‌వలె నా బాహ్మణపి కాచము మాటః దలంచుకొనిన ఆరోజులలో,

క. హాసంబెఱుంగ మొకటియు
పసలేదించుకయు యూకు బాహువులంగూ
పసిపిల్ల పాలు నాడ్రవదు
అసి గొను శత్రువు లేక వహ్ నాపయొడిక

ఇక కృష్ణరాయఁడో,

గీ. రాయచూర్గెల్వ వచ్చెనైర్యః న నలవి
జాపురాధీశుడన్న భామణలవినియు
వృద్ధుఁడయ్యు గుఱ్ఱముపైని వెడలె నెడలు
దెలియకట్టులె శ్రీకృష్ణ దేవుఁడహహ

అట్టిస్థితిలోఁ గృష్ణరాయఁ డెత్తి వచ్చుచున్నాఁడన్న నార్త విని అడలి నుడువనైనఁ దడిలేక గడగడ వడకుచు సైన్యము లడలి వెనుఁజూప విజాపురసామిరాజ్యమునకే తెంచి వెనుజూపినా డాదిల్షాహి. అహా! ఆ రోజులలో మేమున్నఁ జీమలకన్న స్వల్పులము.

తిమ్మ—నిజమునిజము. వారలట్టివారే. ఆంధ్రకర్ణాటకమందుం ను ప్రభువులెల్ల రాతనికి లోఁబడనివారు లేరు.

ఉ. పూర్విక రాజ్యవైభవము పోవునె యంచు భయంబుఁ జెంది సు
ల్తానుకుకీలుబొమ్మల విధంబున నాతని చేత నాడిరి
ట్లా నృపుఁడెల్లపట్టుల విలాసముఁ బోలెఁ జరించె యుద్ధమం
దేని మహాత్ముఁ డాతని సుధీరత నెన్నఁగ శక్యమౌనొకో.

అప్పుడును మీరాయ నైకమత్యమే కారణము.

కుతు—పూర్వమీ యాచారము హిందువులకుండెడిది మాకిది అభ్యస్తమైనది. ఇప్పుడు మీకటాక్షమునఁ జేసి నిర్విఘ్నముగ మేమంద ఱమేకీభవింపుచుంటిమి; ధన్యులమైతిమి.

తిమ్మ—మహారాజా! నన్నింతగఁ బొగడనేల నిదియంతయు దైవికము.

గీ. స్వల్పుఁడను నేను నే నేడ సర్వలోక
పాలకులు మీర లేడ నాపలుకు లేడ
సంధికొనఁగూర్చు టేడ నిశ్చయము తలప
కాకతాళీయన్యాయమైఁ గానుపించు

కుతు—అట్లనకుము. మీకున్న బుద్ధివిశేషము సామాన్యమా ?

సేవ—జీ మహారాజ్! సుల్తానుకు వచ్చినార్ ఊరిమెల్పల కూకోని కభుర్ సేశార్ వజీర్ సాబుతో బోలేశా మేళంగీళం కంచిఁగించిఁ అంతా తయార్ చేసి మీకి మాలుంఖోసం హాం ఆతాహై మహారాజ్ -

కుతు—అచ్ఛా! చల్ రేచల్. తిమ్మయ్యగారూ! మీవాక్యములయందిప్పుడు సంపూర్ణమైన విశ్వాసముదయించినది మీఋణమెప్పటికిని దీర్చుకొనఁ జాలము. ఇదిగో బదులుసలాము. సలాము.

తిమ్మ...సలామ్ దేవా! మీయనుగ్రహము వల్ల నన్నియు జరుగుచుండును.

కుతు—ఓరీ యెవఁడురా?

సేవ—(ప్రవేశించి) కైసా సెలవు?

కుతు—త్వరగా కొన్ని యాసనములిచ్చటఁ దెచ్చియమర్పుము.

సేవ—చిత్తం (ఆసనములు కొన్ని తెచ్చివైచును).

తిమ్మ—మాటలయందించుక నన్నే మాట్లాడనిండు అనఁగా మీరుమాట్లాడఁజాలరని కాదు. నాయిష్ట మెట్లో అట్లే మీరంగీకరించి

తిరచియు మీమాటయే నామాటయనియు వారలతోఁ బట్టుదలతోఁ జెప్పుటయే. కారణము తెలిసినదా?

కుతు—మంచిది. తిమ్మయ్యగారు! మీరెన్ని విధములఁ జెప్ప వలదు. మీయిష్టమునకు నాయం దెవ్వరునుఁ దిరస్కరింపరు. మీయాజ్ఞ రాజాజ్ఞ. మీకెల్లాయనియే నామాభ్యుద్దేశము.

(అంతట యథోక్తముగ బరీద్షాయు నిజాంషాయుఁ బ్రవేశింతురు)

(లేచి యెదురేగుదురు సలాములొసఁగుకొనుట కూర్చుండుట)

కుతు.—ఎంతకాలమునకు మీదర్శన భాగ్యము లభించినది. అంతా కుశలం?

నిజాం—అల్లాకటాక్షమువల్ల యీబ్రాహ్మణుని దయవల్ల మరల మన మొక్కచోట జేరగల్గినారము.

బరీ—చేరగల్గుట కాదు. ఏకమత్యముగలుగ సహోదరులకన్న నెక్కువ వన్నె కురాఁగల్గినాము.

తిమ్మ—నాదేమియు లేదు. సర్వమును భగవత్కృప.

ఉ. దైవమనుగ్రహంబుగలదేని సముద్రములోననీదనౌ
పావకకీలలందుమికి బాధనుబొందక నేగుదెంచనౌ
జీవిరొక్కండుచేసినవిశేషము తో సకలప్రభావవి
ద్యావిభవాతిసాంద్రులుమహాత్ములుమీరొకచోటనిల్తురే.

నిజాం—మీరుస్తోత్రమునకొప్పరు. పెద్దవారలబుద్ధియిట్లేయుండును.

కుతు—నేనుధన్యుడనైతిని. సుల్తానులారా! అగర్భశత్రువగు విజయనగరప్రభునిర్మూలనము విషయమై మీయుద్దేశము లేమి?

నిజా — ఉద్దేశ మేమికలదు? సర్వమునుతిమ్మయ్యగారియిష్టము. నేనుకొన్ని సరితుల జెప్పితిని. మీరావానినివీరిముఖంబున నెవినియుందురు.

కుతు — వినా ్నను విన్నాను. నాకుచాలా సంతోషముగయున్నది.

తిమ్మ — మహారాజులారా. నాయుద్దేశ మిదివఱకేమీతో నొడివి యుంటిని. మీరుమువ్వురకిప్పుడుసమావేశముగల్గించి కార్యనిశ్చయమును దండయాత్రావిధమును నుచ్చటించి విజయనగరధ్వంసమాచరించి కోటకోడలపై మహమ్మదీయపతాక మెత్తించకుంటిని.

శా. పాపాత్ముండగు రామరాజునువధింపన్ గల్గు భాగ్యంబు ఘో
 రాపస్మారము హైందవోజ్వలస్వతంత్రింబూడ్చులాభంబు మీ
 పాప్రిపుంజేరిలభింపజేసికొనిసంభావింపనై యెంచితిన్
 రేపేయెత్తుడుమీపతాకములదోర్దీసత్ప్రతాపంబులన్.

నిజాం — సర్వసన్నాహములతోడ నెవచ్చినారము. మనము ము వ్వురమును ససైన్యులమై యెత్తి తాళికోటకరిగి విమయ మాదిల్షాహిగారికి గూఢచారులచేచెప్పిపంపించి, యుద్ధముబ్రికటించి, మనకోర్కె నిర్వర్తించుకొందము.

కుతు — మేలుమేలు-

బరీ — తరువాతకర్తవ్యమంతయు మనకు తిమ్మయ్యగారెప్పటికప్పుడు బోధింపగలరు.

కుతు — సందేహమేమి? యీవిజయమంతయు వీరిదె.

నిజాం — నాసైన్యము వెనుక భాగముగ నుధ్యబరీద్షాహిసైన్యమును ముందుభాగమున మీసైన్యమును నడిపింపుదము. ఏలనన, మహాబలవంతులగు మహమ్మదీయయోధులెల్లరును మొన్నటి ఆదిల్షాహితో బోరినసంగరమునగతించిరి బరీద్షాహిసైన్య మంతబలిష్ఠముకాదు.

తిమ్మ — తెలిసినది. కుతుబ్షాహాసార్వభౌమా యికమనసైన్యమన్ననో,

అయ్యో! యిదేటికోర్కె శాత్రవదుర్నిరీక్ష్య ప్రతాప పంచాననుండగు రామరాజేశ! కేవల మసదనై నిస్సహాయునై కార్యఖడ్గక్రియా విహీననైన నేనెక్కడ! నక్కకును దేవలోకమున కెంతవాగల దంతటి తారతమ్యము. సుల్తానుల కీలుబొమ్మలట్లాడింపుచున్న నీ మహారాజు నెట్లుసాధింతు! సాధింపకున్న నీపరాభవానలము చల్లారుటెట్లు.

గీ. ఉదకమతిశయ మైనచో హుతవహుండు
స్వీయ తేజంబు బోవగా మాయమగును
లలిపరాభవదావానలము స్వశత్రు
నాశనంబునగా కెట్లు నాశమగును.

ఇందు కేది తెరవు. (ఆలో) మంచియూహ పొడమినది. యీపఠాని మహమ్మదీయుడతిశౌర్యయుక్తుఁడు. నవయవ్వనుడు స్ఫురద్రూపి నన్నెప్పుడేనింగాంచి తనమోహదృష్టుల బ్రసాదించి ప్రసంగింపనుద్యుక్తుడైనట్లుకన్పించు కాని మాప్రారబ్ధవశమున నన్నెల్లప్పుడును దాసీజనము పరివేష్టించియే యుండుట నవకాశము కల్గదయ్యె. ఎట్లైన వీనిని నావలలో వైచుకొని కార్యముగట్టెక్కించుకొందు ననంతరము నామనోభీష్ట మీడేరినపిదప వీనిని బరిణయమై సుఖింతు (యోచించుచుండును) (పఠానిప్రవేశము)

పఠా—(స్వ) ఆహా! యేమి యీసౌందర్యము.

చ. కలకలలాడు మోము నవకంబగు యౌవవనలక్ష్మిముద్దులూ
రెడిపలుకుల్ ముదంబునలరించెడిమించెడి కన్నుదోయితీ
రు లికుచయుగ్మమెంతయు విరోధులనైన క్షణంబులోననే
స్తులనొనరింపఁ జాలెడివిశుద్ధపువర్తనమెచ్చఁ జేయదే.

ఎంతకాలంబు నుండియో యీసతీమణి సాంగత్యముఁ గోరి దివారాత్రములు కృశింపుచున్నాఁడ. నాకీహిందూదాస్య విశేషమునఁ గన్నెత్తి

యైనం జూడ నవకాశము లేకున్నది. కాని, ప్రయోజనమేమి? పవిత్ర మహమ్మదీయసులతానులక్షితయగు నీలతాంగి కాఫరులకు గులాములగు నన్వరింపనిష్టపడునా? కాదీనెలంతకు మెప్పుగూర్చునట్టి హిందూ రాజ్య నిర్మూలనమొనర్చినచో నానిజమహమ్మదీయత్వమును నభిమానమును పరాక్రమమును విని తనిసి తనంతవలచి పైఁబడకుండునా? కాని యిప్పు డైవమెకలఁడు—(ప్ర)కాశముగా, లతాంగీ?

ఆషా—(ఉలికిపడి) (స్వ) ఓహో? నేననుకొన్నంతలోనే యీ తడిచ్చోటికే తెంచినాఁడు. కార్యమెంతయు ననుకూలించు కాలమున కిట్టిసమావేశములే కావలయును.

పఠా—గీ. కలకలారావముల పక్షిగణము గూళ్ల
జేరుచుండెను కమలినీస్త్రీని జేరు
రాకగోరుచుండె ధైర్యమున నొంట
నేరికొరకు నిరీక్షించు చేలతాంగి.

ఆషా—నిజపరాభవాగ్ని జల్లార్ప మహవీరునకై నిరీక్షించు చుంటిని.

ఉ. ఈవుమహమ్మదీయుఁడవ యేనును నట్టికులీననాట నా
భావము వెల్లడించుటకిపాటికి కాలముజూచుచుంటినో
భావజతుల్యరూప నిజబాహుబలంబున వైరివర్గముం
గేవనడంచిమించి ననుచేకొనవే జగమెల్లమెచ్చఁగన్.

పఠా—ధన్యోస్మి! ధన్యోస్మి! మనోహారిణీ.

గీ. ఎన్ని దినములనుండియో యింతినిన్ను
మదివరించి మనోజదుర్మార్గణముల
బారి గ్రసియింపుచుంటి నాభాగ్యవశత
నేడు నాయార్తిదీర సిద్ధించెముదము.

చ. కలిగెనునీకునాయెడ ఁ గారణకాముకత్వమట్టిచో
యలికులవేణినీదయిన యాజ్ఞశిరంబునఁ దాల్చి తీర్తునా
పలుకులువిశ్వసింపుము ప్రపంచలయోద్ధతికీలలం
జెలగెడి మత్కరస్థితవిశేషము ఖడ్గముఁజూడు మింతిరో.

గీ. రామరాజునువధియించి రాజ్యమెల్ల
మనమహమ్మతుకులస్థులకును వశంబు
జేసి హిందూజనాళి నిశ్శేష మొనర
జేతు నాప్రజ్ఞ గాంచుమో చెలి! ముదంబ.

అహా — మనోహరా! రామరాజన సామాన్యుడు కాడే. తురుష్క రాజులకెల్లఁ బ్రక్కలోనిబల్లెమట్లు నటింపుచున్నాఁ డీతని వధించు సాధనమెద్ది? నీవింతధైర్యముగ వచియింపుటకు కారణమెద్ది?

వత. — కాంతా! యీవిషయమంతయు నీవఱకేయుమర్పంబడినది. ఇటువినుము. సలకము తిమ్మయ్యయనునట్టి ప్రజ్ఞావంతుడీ విజయనగర విరోధులైన సుల్తానుల నేకీభవింపజేసి వారలకు బాంధవ్యమును మైత్రియుఁగూర్చి కొలఁదిరోజులలో తాళికోటకెత్తి రానైయున్నారు. సేనాతిమ్మయ్య సటనుండి యేగోజుసమాచారమూరోజెరుంగఁ జేయుచున్నాడను. మరియు విజాపురాధీశుఁడగు ఆదిల్షాహి సార్వభౌముఁడీ రామరాజునకు పుత్రుఁడట్లు నటింపుచు మహమ్మదీయుల యందేకీభవించి యుద్ధమందు రామరాజునకు సహాయ మే తెంతునని చెప్పి రంగమున రామరాజుసైన్యమధ్యప్రదేశమున జొరబారి సైన్యమంతయు నల్లకల్లోలము జేయునప్పుడు నిశ్చేష్టుడగు రామ ... రంగ రక్షకుడుగ మంత్రిమిత్రుడుగనుండు నేనవలీల వధింతును. సతీమణీ!

గీ. రాజువచ్చినచోఁజతురంగబలము
వాలి కూలి పరుగువారి బేలయగును

పెక్కు దక్కన వారలం జేసి విజయ
నగరమును గొందు మేటి కాంతాలలామ!
అప్పుడు పవిత్రమగు నీకరగ్రహణభాగ్యమునందెదను.

ఆషా — మేలుమేలు మనోహరా! మీ చింతయోచించిన విష యానికి [illegible] నా హృదయతాపమించుక చల్లారినది. కావున ధన్యురాలనైతిని.

పతా — సహజ స్త్రీచాపల్యంబునం జేసి నీవెచ్చటనైన నీవిష యము జారవిడిచెదవేమో. జాగ్రత్త! అట్లగునేని మనవలన మహమ్మదీ యరాజ్యములన్నియు నున్నోత్తుంగవశించు నిది పరమరహస్యము. నీవైన ను కార్యజ్ఞురాలవగుట నే జెప్పవలసియుండదు.

ఆషా — చిత్తము.

పతా — మనోహారిణీ! [illegible] సంకేతవనమున సమాగమ ము. పొద్దుగ్రుంకి కొన్ని గడియలైనది. నీకొఱకు వేరేని చేటికాజనమేతెం చిన నెంతయు ముప్పువాటిల్లు. కావున, పోదము పద.

ఆషా — అట్లేయగుగాక. (నిష్క్రమింతురు.)

(ప్రవేశము సలకముతిమ్మయ్య)

తిమ్మ — ఆహా! నేటికి నామనోరథ మీడేరుభాగ్యము లభించి నది. విశ్వప్రయత్నముం జేసి సుల్తానుల నేకీభవింప నొనర్చితిని. ఆదిల్షా హిని నాకు ముఖ్యశిష్యునిగ జేసితిని. కుతుబ్షాహా గులాము, నిజాంశా హి నాయిష్టము కనుసన్నచే గ్రహించి మెలంగెడి పాతభృత్యుడు. బరీద్షాహి నా గూఢచారుడు. చతురంగబలములు నాచతురతానిబద్ధ ములు. నాతంత్రము రామమంత్రము. సర్వప్రజలును నాచేతికీలుబొమ్మ లు. విషయములన్నియు నాయెదుట ఫలకలిఖితములు. ఇంక విజయ నగరము తృణసమానము. రామరాజు మృత్యుదేవతా సమీప భృ

త్ర్యుడగుట కెట్టి సంశయముగుచు లేదు. ఔరా! యెంతటి దుర్ఘటకార్యమైనను, మనోబలమును మించి లేదుకదా! ఓ మనోబలమా! నీవెల్లు నడచిన ప్రపంచము నట్లు నడచును. నీవెద్ది సాధింపనై సంపూర్ణ ప్రయత్న మొనర్చెదవో అది కాక మానదు.

సీ. సైన్యసామంత ప్రజారక్షితాంతఃపు
రేశు బాలుని మారి ముంచినావు
పరరాజ్యదుర్భేద్య తరభుజవిద్యాన
గర మొక్కత్రుటిలోనఁ గాల్చినావు
హైందవనామ సంహారదీక్షితుని నా
దిల్షాహి స్నేహంబుఁ దెచ్చినావు
అన్యోన్యవైర విహారవాంఛితుల సు
ల్తానుల నొకటిగాఁ జేసినావు
గీ. ప్రబలబలు రామరాజు జంపంగ పిదప
రాజ్యరమ నేల సైన్యవిరాజితుఁడుగ
సలకవంశశశిని తిమ్మసార్వభౌము
వెంటగొని పోవుచుంటి వీవేళ నీవు.

ఓ మనోబలమా! విజయానంతరమువఱకు నన్నొక్కపట్టున విడిపోకుము. నీకనేక వందనములు "ఆహా! సలకము తిమ్మయ్యకసాధ్యమగు కార్యము లేదని విజాపురము, నిజాంరాష్ట్రము, బీదరు మొదలగు రాజ్యముల రాజగృహముల నంతఃపురముల వీధుల బోధల గొందుల సందుల వనముల మనముల వేయేల సర్వప్రదేశములఁ బ్రతిధ్వనించుచున్నదికదా, యిట్టి యానందమనుభవించునట్టి మహద్దశ యీభరత ఖండమున నీ కాలమున నా కొక్కనికే లభ్యమయ్యెనని తలంచెద కాని, నా మనమున నొక సందియము విడువక బాధింపుచున్నయది. యుద్ధానంతరము విజయము నాకనుట నిర్వివాదాంశమే. తరువాత విజయనగర

సామ్రాజ్యము నీమహమ్మదీయులు పాలొనంగుదురా? కనికరమెట్టిదో యెఱుఁగనికఠినతురకలకు విశ్వాసముండునా? యమునది శూలమువలె హృదయగోళమును భిన్నాభిన్నమొనర్చుచున్నది. కానిమ్మిప్పటికి మఱియొకవలఁ బన్నలేకుందునా!

గీ. దొంగలకుఁ గన్నమును వేయఁ గోడుసూపి
యింటివానిని లేపి నాల్గంటఁ జూచు
వానివిధమున హిందూయవనజనాళిఁ
గాల్చివైచెద మంత్రాంగ కాలవహ్ని—

నన్నుఁ దిరస్కరించిన రామరాజు గతి యేమికానున్నదో దానినే మహమ్మదీయు లనుభవింతురుగాక—

గీ. స్వకులనాశనముం జేయఁ జాలినట్టి
నాకు మిత్రుఁడు శత్రుఁడనంగ నెవరు
గుడిగుభేళ్ళన మ్రింగెడి క్రూరునకును
తలుపు లప్పడములుగావె తలఁచిచూడ.

నేనెందునకును వెఱవను. నాకేటిసంశయమును లేదు. భగవంతుఁడిచ్చిన యాయువు చక్కఁగనున్న సముద్రమును మురుగుకాలువగ మురుగుకాలువ సముద్రముగ జేసివైతు. (తలయూపుచు)

(నిష్క్రమించును.)





# రామరాజు.

(ఫాలాఫ్ విజయనగర్)

## చతుర్థాంకము.

(విద్యానగరము సభాభవనమందు వెంకటరాజును రామరాజును సామంతులుం బ్రవేశము)

రామ—సామంతులారా! వింటిరికదా? గూఢచారుని వృత్తాంతము మనమిప్పు డాదిల్శాహిబుద్ధినిఁ బట్టి పోవలయును.

వెం—అన్నయ్యా! మీరు కోపింపకుందురేని నేనొకమాటఁ జెప్పెద.

ఉ. పీఁడుతురుష్కుముష్కరుఁడు వెక్కిరికొక్కిరి ముద్దు లిచ్చుచా
లాఁడుచు "నన్దనుండనె జిమా!" యని మిమ్ముల మోసపుచ్చు న
వ్వాఁడు దురాత్ముఁడీతని యవాకుచవాకుల నమ్మనచ్చునే
గాడిదెబండిలాగినను గాని హాయంబున కీడువచ్చునే.

మరియును.

సీ. మూషికమార్జాలములప్రేమమెట్లగుఁ
దూరకలచెలిమిహిందువులకట్లు

గోవ్యాఘ్రములకు స్నేహవ్యాప్తి యెట్లగుఁ
దరకల చెలిమిహిందువులకట్లు
సాతానిజంగమసచ్ఛిష్యులెట్లగుఁ
దరకల చెలిమిహిందువులకట్లు
శ్రోత్రియునకు వేశ్య సురతస్మృదెట్లగుఁ
దరకల చెలిమిహిందువులకట్లు.

ఆ. వె. వీరుశూరువుమ్లెచ్ఛవారు పశ్చి
మాశజాతురు పరిశుద్ధహవ్యభోక్తాదు
దినిన గోమాంసమును దినుఘనులువారు
అహహపుత్రత్వము పితృత్వత్రమడుగనేల ?

కావున వాపలు కాలకించి వీనికీయుద్ధమున నవకాశమివ్వకుఁడు.

నర—మహారాజా ! క్షమింపుఁడు.

ఉ. శూరులువీరులార్యులు విశుద్ధులుఁ గల్గిపవిత్రమైన యీ
భారతజాతికెంత తలవంపు ఘటించితిరక్కటక్కటా
క్రూరుడు గోవుమాంసమునకుర్ జెయిసాచెడివాడు దుష్టథా
చారుడువీనిఁ జేర్చుట విచారణజేయు డిదెట్టులొప్పగుర్.

వీని నీయుద్ధమందె కాదు; రాజ్యమునుండియే వెళ్లఁదరుముట శ్రే
యము.

తిప—సార్వభౌమా !

శా. ప్రారంభంబుననుండి వీండ్లు మనయార్యావర్త దేశ ప్రభా
ధీరత్వంబులడంచి గ్రంథముల సంధీభూతముల్ సేసి యెం
తో రమ్యంబగునాలయంబుల మసీదుల్ జేసి జుట్లూడ్చిహిం
దూరూపంబు మహమ్మదీయముగఁగాదో దుష్టకృత్యంబుచేర్.

యున్నన్ని మాయతంత్రములఁబన్ని యీ మనదేశము స్వాతంత్ర్యమునుగఁ జేసిన పాపాత్ముల వీరిని వరించుటకు మీరుగ భరించుట మనకు రానున్నకష్టపరంపరలకాదర్శము. మహానుభావా !

గీ. పుత్రశోకాగ్ని మీదేహమును దహింప
చ దనము వోలె వాఁడు భూషణములాడె
విషమరగదీసి కలిపి భావింపనంద
టం చెరుంగక మోసమునందగలవు.

పైనదేవర వారిచిత్తము.

రామ—ఇప్పటికి మీయుపదేశములన్నియు ముగిసినవికదా ! మీరెంత పిచ్చివారలు

ఉ. నందనుఁడట్లు వెన్వెడక నన్ప్రియమారగగాల్చి సర్వదా
నందముతోడ నేలుచును నాఁకలు కే తనపల్కు–గాఁగ పెం
పొందగ రాజ్యగౌరవము నుజ్వలకీర్తియు నాపదాల్ శిరం
బందున దాల్చి నిల్చెడి మహామతి పాదిలుశాహి స్వల్పుఁడే.

ఇంకనాతఁడు మహమ్మదీయుఁడు. మనకా జన్మద్వేషపూరితమగు వంశమున జనియించినాడు. పైపెచ్చుహిందువులకు మొదటినుండియు మహమ్మదీయులన్న గిట్టదనికదా ?

ఉ. హిందువులందు మూర్ఖులతిహీనులు లేరొకొ చందనాటవిఁ
గ్రిందినకంటకావనిజరాజినిబోలె మహమ్మదీయులం
దుందిలకింప శాంతులు బుధుల్ దనరారరె ఘోరకాననం
బందుమృగాళిమధ్యగతమై చెరలాడడిలేళ్ల పోలికన్.

అందుకు మన సలకము తిమ్మయ్యగారే ప్రమాణము. రెండవదానికాదిల్షాహియు—సామంతులారా ! మదన్వవాయసంజాతుఁడైనను గుణమునుఁబట్టి యున్నతస్థానము నొసఁగి పూజించుటకెట్టి సంశయమును లే

దిది శాస్త్రవిహితమును రాజార్హకృత్యమునగుట నసిందితి యిటు చూడుఁడు.

చ. సతతము సౌరభంబు వెదజల్లి వెలుఁగుగులాబి కంటకా
వృతమయినన్ మనోజ్ఞమగు పెంపువహింపదె? దుష్టవార్ధసం
గతమయి పారుచుండినను గంగ పవిత్రిలఁ జేయదె మనో
ధృతిఁగల వీనిదుష్కృల మదేటి విచారణ? చెప్పడో ఘనుల్

మీరు విషయమును గ్రహింపనేరక మామూలుమాటల వల్లె వేయుచుంటిరిగాని యీదిల్హీగుణమునించుకయుపరిశీలింపరైతిరి.

సీ. ప్రాభాతమునఁ దుంగభద్రాదినిస్నాన
మాడియుధౌతాంబరాళిఁ దాల్చి
తిలకంబు నొసలుపైఁ దీర్చి మొక్కి సత్
భూసురాశీర్వాదములనువడసి
తదనంతరంబు మాతాపితృవందనం
బులఁ జేసి పంచాంగఫలమువినియు
సభకేగుదెంచి రాచరికంపు కార్యముల్
నవరించుకొని సర్వసమత లేచి

గీ. భోజనముఁ జేసి గీతలబూని మాకు
నన్వయమొనర్చి చెప్పుచు హరిపదార
విందధ్యాన విహారభావితు విరక్త
సంగుఁడాదిలుశాహియసంగవినరె—

యెవ్వనికొఱకు నిజాముతోఁ బోరి ఘోరపరాక్రమము నెఱపి కళ్యాణదుర్గము సాధించి యొసంగితినో యెవ్వనివలన నవాబులందరును నన్నుఁ దేరిచూడఁజాలక నాకు వంగివంగి సలాములర్పించుచున్నారో యెవ్వఁడు నాసైనికులు చెలరేగి మహమ్మదీయస్త్రీల మానంబును

వారి ప్రజల ప్రాణంబులును, వారి సైనిక త్రాణంబును వారి ఖురాన్ గ్రంథదాహంబును మసీద్ మారణంబునుఁ గావించినప్పుడు నాయందలి మనహిందూమతమందలి యభిమానంబున నోర్చియుండెనో యెవనిసహాయంబున గోలకొండ రాజ్యములోని ఘన్ పుర పానుగల్లులను దుర్గద్వయమును సాధింపఁగల్గెనో యెవని జనకుని కాలమునుండియు మనకధికమైత్రిగల్గి వర్ధిల్లుచుండిరో, అట్టి ఆలీ. ఆదిల్షాహిని మాత్రము నేను తిరస్కరింప. బహిష్కరింప. ఇందుకు మీరెదురాడు సమంజసము.

వెం—అన్నయ్యా ! తనతండ్రియగు యిబ్రహీం కాలమున మనము గెల్చి స్వాధీనపఱచుకొనిన రాజ్యములన్నియుఁ గ్రమంబున మనవలన గైకొనసెంచి మైత్రిలేక సాధింపనశక్యమని యీపన్నుగడ పన్నె అంతకులకు మొన్నటి కళ్యాణగిరియే తార్కాణము. ఆవిషయమట్లుంచుడు—మొన్నటి అహమ్మద్ నగరపుముట్టడిలో మహమ్మదీయులకు మనము కావించిన యపకారములకు నవాబులెంతేని మండి లోలోన సంధుల జరుపుకొని ఆదిల్షాహితో గూఢముగ నేకీభవించి యుద్ధమున కేతెంచుచున్నారనియు వదంతికలదు. వారి రాయబారుల నవమానించుట మరియుఁ కంటకమైనది. మనపురమునుండి ఆదిల్షాహా పోవునప్పుడు మీరూరు దాటువఱకుంప లేదని వాని కాగ్రహముగల్గినట్లూహింపఁ గల్గితిమి. ఇట్లుండ మీకొక ప్రబలమైన తార్కాణము జూపెదను చిత్తగింపుఁడు.

దుర్మార్గుఁడగు సలకము తిమ్మయ్య వారలకడఁ జేరి తరతరములనుండి విరోధముచే విఱ్ఱవీగు నిజామునకును ఆదిల్షాహికిని సంధి గూర్చె. వైరముడిపె నెట్లన్న ఆనిజాము పుత్రికయగు చాందుబీబీని ఆదిల్షాహా కొసంగి వివాహ మొనర్చిరి. షోలాపురదుర్గ మరణమొసంగె నింక ఆదిల్షాహా చెల్లెలిని నిజాముసహోదరుఁడగు మూర్తిజాకొసం

గిరి. ఇట్లు బంధువులై గోలకొండనవాబగు కుతుబ్షాహితోఁ జేరి మనకు చిరకాలవిరోధియగు ఆదిల్షాహింగూడ సర్వనాశనంబొ ఘర్తి చేసి సమ్రాట్సామ్రాజ్య లాభలక్ష్యకార్యాచరణము. కేవలము మీరు దుష్టపుత్రుఁడగు మ్లేచ్ఛుఁడు లేని వివాహసంబంధమునుపైన మీ కించుకంత వత్తాసు నొసంగినాఁడేమో చూచితిరా? కేవలము స్వాతంత్ర్యము హృదయశల్యప్రాయులమగు మనమూడ్చివైచు పాపయంత్రము మహారాజా! యింక మాకేటి యనుమానము వానియందేటి యాపేక్ష?

సేవ—(ప్రవేశించి) మహారాజా! విజాపురమునుండి చారు లేతెంచి యున్నారు.

రామ—రమ్మని చెప్పుము.—

సేవ—చిత్తము.

(నిష్క్రమించును.)

(విజాపురచారులు ప్రవేశము.)

చారులు—మహారాజాధిరాజసార్వభౌమా! సలాములుసలాములు.

రామ—ఓయీ యేమిటి శేమములు?

చారు—జీ తుమారా బేటి ఆదిల్షాహి మహారాజ్ తుంకు ఖత్ లిఖ్నా దెఖోజీ ప్రభో.

రామ.—తెండు, (చారులు కాగితమిత్తురు.)

రామ—(చూచి) మిత్రులారా! మీసంశయములన్నియు నివారణయగునట్లే యుత్తరమంపినాఁడు. చూడుఁడు గోపానాయకా! చదువుము.

గోపా—(చదువును) శ్రీమన్మహారాజరాజ.

రాము—పైనకార్యము మట్లాడుము. తరువాతను.

గోక—తరువాతను. నాకు నిజామ్ కూతురగు చాందుబీబీని వివాహమాడవలయునని కోర్కెకలదు. విరోధిపుత్రికయైనను "స్త్రీరత్నం దుష్కులాదపి" అనికదా ? తరువాత షోలాపురము సరణముగ నొసగుటకై వొడంబడికలు జరిగినవి. ఆదుర్గమును యుద్ధముచే సాధించుటకు విశేషసైన్యము నాశనము కావలయునుగదా. దీనివలన మనకేమి లాభము! పిమ్మట మూర్తిజాకు నాచెల్లెలినిచ్చితిని. దీనికి కారణము పిల్లయిష్టమునుబట్టి పోక తప్పలే దీకార్యములు మీకు విరోధిసని చెప్పినఁగాని వలను పడవయ్యె. మీచరణసన్నిధిఁ జరుగవలసిన శుభములిట్లు పరోక్షమున జరిగినవి క్షమింపుఁడిప్పుడీ విషయ మమ్మగారికి నామనఃపూర్వకవందనములతో నివేదింపుఁడు మఱి ముఖ్యముగ వ్రాయుటేమనగా? నవాబులందఱేకమై యెత్తి తాళికోటకరుదెంచిరి. వారలం గ్రే నేకభవించినట్లు ప్రస్తుతము నటించి యనంతరము యుద్ధకాలమందు ససైన్యుఁడనై మీలోని కేతెంచెద నన్నప్పుడు నిరాక్షేపణగ ప్రవేశింపనిండు. మన యుభయసేనాసాగరమధ్యమున తురుష్కసేనలోకనదీప్రాయములు కాకపోవు. సర్వజ్ఞులగు మీరెట్టి ప్రయత్నలోపమునుఁ జేయరని నాయభిప్రాయము—నాతప్పులన్నియు మీపాదపద్మముల సన్నిధినివేదించుకొనినఁగాని నాయాత్మకు శాంతి లేదు.

ఇట్లు కుమారుఁడు,

ఆలీ ఆదిల్షాహా.

రామ—ఇప్పటికి మీయనుమానము లన్నియు ప్రమాణరహితములైనవికదా ?

వెంక—(లేచి) ప్రమాణ రహితములు కావు. ప్రమాణసహితములైనవి. ఇంతవెఱ్ఱిమూర్ఖుఁడగువాఁడు కన్యాలోలుఁడై వివాహమాడుఁ

గాక వివాహానంతర మేల నువలో చేరరాదు ? యీవిషయము పూర్వమే యోచించుకొనవలెను. యుద్ధరంగమధ్యమున నాచేతులనా యుధము నసహ్యోఁ జేసిరట. అది మారణకృత్యమా కామారణకృత్యమునకా ? ఉభయసేనావాహినీమధ్యమున చేతెంచు కుత్సితాభిప్రాయమిషమైకదక్షు రెవ్వరు నాటంకపఱుపరాదట. నాఁడు దత్తపుత్రుఁడట యీయాలోచనము తాళికోట కేతెంచువఱకుఁ దోఁచదయ్యెకాబోలు. ఇది విజయనగర సామ్రాజ్యవిధ్వంసమున కేర్పడినట్లు తోఁచుచున్నది. లోకమున నెందఱీపుత్రులు పరలోకగతులు కాలేదు? కొందఱూడిన వారిసౌఖ్య మతీతమై మహమ్మదీయులఁ బుత్రులుగ స్వీకరింపు నంతటి యవస్థకుఁ దార్పకలెగా? కానిమ్ము.

ఉ. ఆవిధితాటీపుండ్లగతి నాయవనాళి శిరంబులీధరా
దేవికినిత్తు భూతబలిఁ దీరగ తృప్తివహింప కాకగృ
ధ్రావళి నారికాంతలకటా యవిగుండెలగుగ్గుకొంచుమః
ఖావిలమానసంబుల మహాటవులందునఁ జావడెంతయున్.

యెవరెట్టికుతంత్రములైనఁ జేయుదురు యెవరెట్టి మాయావాగురలకైన లొంగుదు. యెవరెట్టి హిందూరాజ్యధ్వంసమునకైనఁ గడంగనిందు ఉత్తముఁడగు సుక్షత్రియవీరుఁడెవఁడైన నుండిన నన్ననుసరించుఁ గాక లేదేని నేనొక్కఁడ పగవీరభయంకర నిశితకరవాల మాత్రద్వితీయుఁడనై పోయెద. (పోబోవును)

రామ—(చెయిఁబట్టుకొని) తమ్ముఁడా శాంతింపఁగదోయీ! నీయిష్టమున కెవ్వఁరు తిరస్కరింపఁ దలంచిరి? విజయనగరసామ్రాజ్యోద్ధారణము నీవలనఁ గాఁగలదని మేమెల్లరమును చేతులు సాఁచియున్నార మట్టియెడ మహాగ్రహమున నొక్కఁడవే యరిగిన రానున్న విపత్తు నాలోచించుకొనుము పూర్వాపర సంధర్భము లెఱుంగ లేమి తర్కిం

పుచుంటిమికదా? నీకెట్లీప్సిత మబ్బుఁ గాక! వృద్ధుఁడనై జరాభారమునఁ బుద్ధితార్స్తారై పరలోకప్రయాణోన్ముఖుండ నగు నాయెడనా నీవాగ్రహించుట? లేక మన కునికిపట్టయి హిందూలోకాలంకారమగు విజయనగరముపైనా? లేక నీసామంతులమీఁదనా? తమ్ముఁడా! వెంకటరాజా! నీకీముసలియన్నపైననే నాపూర్ణాగ్రహమును, అసూయయు నుదయించినచో,

మ. పరిపాలించితి నెంతకాలమొ యశంబా కూర్చితిం గొంత ఘో
రరణాళిం జయమందినాఁడ నరులా రవ్వంత శీర్షంబుఁజా
పరు నేఁడీగతి నెత్తివచ్చి రెటులన్ వర్తించినన్ నీవు బా
లురనుం గాగలవారు సంగరమికెట్లో తీర్పుడీ మేలగుం.

నాకేటికి?

గీ. ముక్కుమూసికొనుచు నెందొమూలఁగూరు
చుండిభగవంతు వేఁడుట లొప్పుగాక
లేనిపోని ప్రమేయముల్ బూని రాజ్య
భారమీయీడున భరింప బాగె చెపుమ!

(విచారించును.)

వెం——(కాళ్ళపైఁబడి)

శా. అన్నా! పాపమునైపఁజెల్లుఁగాక లోకారాధ్యునిం గ్రూరబు
ద్ధిన్నానోటికి వచ్చినట్లరచితిన్ దీనుండ నజ్ఞుండ మీ
రెన్నంబోకుఁడు వీనిమానసమునం దెంతేని మీయాజ్ఞఁ దా
ల్తున్నా శీర్షమునందు బాల్యచపలాత్ముం వీని మన్నింపవే.

రామ——(లేవనెత్తి) నాయనా! కర్తవ్యమును బోధించెద. నీవింక శాంతివహింపుము. సామంతులారా! మన ప్రయత్నమెట్లున్నది?

నర — మహారాజా! రాష్ట్రమందలి యన్ని భాగములనుండియు సైన్యముల రప్పించితిమి కదా! అది యంతయు నాలుగులక్షల కాల్బలమును లక్ష గుఱ్ఱములును ముప్పదివేల గజములును కలవు.

రామ — సరియే అట్లయినచో నాచిన్నతమ్ముఁడగు తిరుమలరాయునికి లక్ష కాల్బలమును నిరువదివేల గుఱ్ఱములును నైదువందలగజముల నొసంగి ముందనిపి శత్రువులు కృష్ణానదిని దాటి రాకుండునట్లం పవలయును నాకుమారులగు పెదతిమ్మరాజును కొండలరాజునుకూడఁ బంపవలెను. పిమ్మట శేషించిన వాహినినిఁ గూడి వెంకటరాజయుక్తులమై మనముందఱమును రణావని కరుగవలయును కావున నిదియాజ్ఞ.

అందఱు — చిత్తము —

(యవనిక పడును.)





# రామరాజు.

(ఫాలాఫ్ విజయనగర్)

## పంచమాంకము.

(ప్రవేశము కృష్ణానదీప్రాంతము గుడారములో తిరుమలరాజు)

తిరు.—దుర్మార్గులగు శత్రువు లెంతవేధింపుచున్నారు! రామ రామా! ప్రాణమువిసవెత్తుచున్నయది. కృష్ణానది పొడవుననుండు రేవు లన్నియు ఫిరంగులతో కఠినముగ సంరక్షింపబడుచున్నయది వారికి వలికభిముఖముగ నుండురేవును నేను స్వయముగ కాపాడుచున్నాఁడను. మొన్నటినుండియు శిబిరములవిడిచి చాలాదూరమరిగిరి. వారిని వెన్నంటి మేమునుం బోవుచుంటిమిప్పు డీరాత్రి మరల శిబిరములం బ్రవేశించినట్లు నటించి యెటుపోయిరో తెలియదయ్యెను. కర్తవ్యమెట్లు?

ఉ. మానితబాహువిక్రమరమా పరిశోభితులుజ్వలప్రభా
జ్ఞానులునైన శాత్రవులు నల్వురునిల్వఁగ సైన్యసాగరం
బేనితరంగసంఘరుచి నెంతయు బొల్పెసలార మించి కృ
ష్ణానదిదాటివచ్చిన నశక్యము వారలఁ బోరగెల్వఁగాన్.

ఇందులకే యన్నగారు దారులన్నియు బిగించినన్ని సైన్యసహాయునిగ నను నర్పించినాఁడు.

చతుర్థాంకము.

(సేవకుఁ సహసాత్ ప్రవేశము.)

సేవ—మహారాజా! శత్రునృపు లెనుటి రేవుఁ నదిని దాఁటిరి

తిరు—ఆ! ఆ! నదిని దాఁటినారా? ఓహో సైనికులారా!

గీ. ఎంకు శాత్రవవర్గ ముద్దండరీతి
రేవుదాఁటిమననూఢ్వ రాజోక్షుచున్న
వారలట ఆయుధముల మీ వాహనములఁ
బూని ఘోర హావానందమూని వేగ.

(పోఁబోవును.)

(మరియొక సేవకుఁడు ప్రవేశించి) మహారాజా! వందనము. ప్రభువు గారు ససైన్యులై శత్రుపురం దాకిరి. మిమ్ముఁ ద్వరలో కలియరమ్మని వార్తనంపిరి.

తిరు—మేలు మేలు. యన్న గారేతెంచిరా? మేమిదేవచ్చుచున్నారము.

(నిష్క్రమించును.)

సోమ—(ప్రవేశించి) రామనాథా! యీవైపునకురమ్ము. సంగర సమీపమునను శ్మశాన సమీపమునను నిలువరాదందురు.

రామ—యెందువల్ల?

సోమ—యుద్ధము దగ్గఱనున్నచో యేతు పాకిగుండుకో మొగురుట తటస్థించును-శ్మశానసమీపముననున్న ఆయుక్షీణము.

రామ—పొగపారుటచేతనా? సరియె. నాకు దూరమగుటవల్ల కొంచెము దృష్టిమాంద్యముగనున్నది. యిప్పుడెవరి సేవ యెదిరినిలిచిరి? యెట్లు సంగరము ప్రవర్తిల్లుచున్నది?

సోమ—ఆవిధి నదినిదాటిన మూసల్మానులు దక్షిణాభిముఖులై నిలువఁబడిరి. కుడివైపు నాదిలుశాహాయును. ఎడమవైపు బరీద్సాహి

యు కుతుబ్షాహాయు నడుమ నిజాంశాహాయు తమతమబిరుదుపట్టంబులు మెఱయ నెదిరించిన నెట్టిశత్రువునైన గెలువఁదగియుండిరి. హిందూసైనికు లుత్తరముఖులని వేఱుగఁజెప్పనేల ? బీదరగోలకొండనవాబుల నిర్వార నసహాయశూరుఁడగు వెంకటరాజెదిరించె చూడుము.

రామ—ఆ! గ్రహించితిని. కనులైనను లీల పోలేదు. సరియే; మధ్య నిజాంశాహానెదుర్కొనినది వృద్ధరాజుగారేనా ? అబ్బా! ఎంతటియసాధ్యుఁడు! తొంబదియాఱేండ్ల ప్రాయమట! యుద్ధమందు ప్రేమనశింపలేదు. పదునాఱేండ్ల బాలునివలె చెంగలించి దుముకుచున్నాఁడెంతయద్భుతము ? మఱొక స్వల్పసైనికు నెదిరింపరాదా ? ఇట్లేల ?

సోమ—ఔను! కానిప్పుడున్న స్థితినిఁబట్టి పోవలయు సరియే! చూడఁబోవుచున్నారము కదా ? తినఁబోవుచు రుచులడుగనేల ? ద్రోణాచార్యుఁడు వృద్ధుఁడు కాఁడా ? భీష్ముఁడు తాత కాఁడా ? సంగరమున దిగ్గంతులవంటి పాండవులకు పంచకూళకషాయముఁ బోసినారు. వీరి కేమి చూడుము మాచివరనున్న ఆదిల్శాహాను పినతండ్రియగు తిరుమలరాయఁడెదుర్కొన్నాఁడు.

సోమ—ఈజట్టీసరిపోయినది. కాని రామరాజుకు దత్తుకొడుకగుటేమి! యెదిరించి యుద్ధమేమి ? ఎందుకువచ్చినజట్లుజట్లసరాగము?

రామ—అందేదియో చమత్కార మిమిడియున్నది. అదిగో సంగరమారంభమైనది.

(తెరలో ధ్వని)

ఓహో! మహమ్మదీయులవిలుకాండ్లు హిందూసైన్యముపై శరవర్షముఁ గురిపించుచున్నారు. ఆహా! ఏమి వారిలక్ష్యశుద్ధియు బాహుబలమును.

చ. కనుమటుభూరి బాహుబల గర్వితులైన విలుకాండ్లు నిల్చి నా
రిని వెనులాగి సుప్రకశరీకము లొక్కటుడూసిపోవ నే
సీకరలాఘవంబు తమచేతితుపాకుల నెత్తి హైందవు
ల్మ్రొసఁగ దలింపుచుండి రతిమూర్ఖుల ప్లేన్ఛులఁ గాల్చివైచుమన్

మనము వృద్ధరాజుయుద్ధము నున్నందు చూచి మన సంశయనివార
ణఁ జేసికొనుట ప్రథమకర్తవ్యము. (చూచి) అహా ! నిజమునిజము.

ఆ. వె. రాముఁడేల ? పరశురాముఁడేలగణ స్థ
స్థాణుఁడేల ? నట్టిద్రోణుఁడేల ?
రామ— వృత్తులకు సేవ వృద్ధియైనటుపిని
వయసు హెచ్చి బాహుబలము హెచ్చె.

సోమ—ఆగుమాగుము. నిజాంశాహాపూర్వవైరము తనిపోవ
సేమో యనుచున్నాఁడు వించను.

(తెరలో)

ఓ హైలా రామరాజా ! నీకు కాలమాసన్నమై నాయెదుటఁ
బడితివి.

ఉ. ఆని బలంబురంబుగల "యాదిలుశాహ" నుఁగూడి మాను క
ళ్యాణి జయించినప్పటివిలాసము సాగదు "మాకు నిత్యక
ళ్యాణము పచ్చతోరణమవో" తలనున్నఁగగార్గి గార్ధిక
ళ్యాణముఁ బాడువాడ నిలుమా క్షణమాత్రము సంగరావనిన్.

సోమ—యీభేదజభాషణంబులకేమిలే అమ్మొసలిపీరునిమెదు
ట నీవు శలభసమానుఁడవు. ఆ ! అదిగో రామరాజేమో నుడువు
చున్నాఁడు.

(తెరలో) ఓరీ ముష్కరతురుష్కాధమా.

చ. క్రిమమెడలంగ హిందువుల గాసియ బెట్టి సురాలయాళి దు
ష్క్రియఁ బడఁగొట్టి సాధుల శతాధిక కీలల నూటఁగట్టి న్యా
యముఁ బడవెట్టి కొట్టికలుపాత్మ్మని ఐన్నఁ దిరించి త్రింతు సిం
గమా గజమాంస మాస గొన నైజముగాక దినూత్నశక్తియే.

సోమ — బాగుగ నుడివినాఁడు.

(తెరలో ఫిరంగులు పేలుట)

రామ — హా యిదేమి వైపరీత్యము. సోమనాథా! అటుచూడుము యవనుల కృత్రిమోపాయము. ఫిరంగులన్నియుఁ బేర్చి ముందు విలుకాండ్రచే యుద్ధముఁ బ్రారంభింపఁజేసి హిందూసైనికులు సమీపమునకువచ్చిన వెంటనే విలుకాండ్రఁదొలఁగించి ఫిరంగులనన్నిఁటి నొక్కపెట్టుగఁ బేల్చిరి. అయ్యో! అయ్యో! హిందూసైనికులెట్లు దిక్కుదోఁచక పరువెత్తుచున్నారు.

సోమ — త్వరపడక నిరుదెసలఁ గనుగొనుము. వెంకటరాజును తిరుమలరాజును తమతమపరాక్రమముల విజృంభించి నడుమనున్న సైన్యము ఫిరంగుల వాఁతఁబడుట కెంతయు నాగ్రహించి తురుష్కవాహిని నెట్టుక సిమసంగుచున్నారు. మేలుమేలు యిప్పట్టున మ్లేచ్ఛులు కొంచెము వెనుకంజ వేసిరి.

(తెరలో)

చ. యవనులమోసపుంబనికి యద్భుతమందెదవేల ? పాపసం
భవులకు న్యాయయుద్ధమనుమాటస్ఫురించునె ? శత్రుమారణో
త్సవమున నేగుదెంచితిఁ బ్రశాంతివహింపుము నీవు కార్యభా
రవహనశక్తి నాకిడుమ రాతులదుర్గతిఁజూడుమా ప్రభో.

రామ — యీతఁడెవ్వఁడు ప్రళయకాలరుద్రునిఁబోలె వచ్చుచున్నాఁడు

సోమ—యీతఁడు గోపానాయకుఁడు. విజయనగరసామంత ప్రభువులలో నొకఁడు. పాపము! రామరాజునకు కావలసినంతసాయమేర్పడినది. ఇరుల సైనికులు పురిఁగొనుచున్నారు. యవనుల బారిగొనుచున్నారు. ఆహా! ఒకరికొకరుఁ దీసిపోవని యీకయ్యమే చూచితీరవలయును.

సీ. శూరుల దేహముల్ ద్వారు పుల్శిరములు
రాలు నావలుగాఁగ రథచయంబు
గజశరీరములు లంకలుగాఁగ బాణదూ
ణాదులు జలచరసర్పాళిబోల్క
కాకగృధ్రాది భూతాళల్పితారావ
స్వనముల్ప్రవాహ నిస్వనముగాఁగ
నుభయసైనికచయ మొప్పఁగ చచ్చెడి
వారు కూలెడిమృద్వికారముల్గ

గీ. కేవలభయంకరావేశ భావమునను
శోణదీధితిశోడ దృక్కోణములకు
వేరమైఘోరరక్తపు టేరు బారు
చున్నయది చూడుమా యిట్టులెన్న రాక.

రామ—సరే! నీవర్ణనలో నీవు మునిఁగియున్నాఁడవు. పాపము రామరాజుయుద్ధము గోపానాయకుని తలపైనిడి సైనికమధ్యభాగమున నెత్తుగ రత్నమయమైన నొకగద్దియపైఁ గూరుచుండి సైనికులఁ బ్రోత్సాహించుచు యుద్ధమునందనివార్యపరాక్రమము నెరపినట్టి శూరులకు రత్నములు వజ్రములు మణులు కెంపులు వరహాలు రూపాయలు వల్లెరములతో బహుమానములొసంగుచున్నాఁడు. దానంజేసి సైనికులమితోత్సాహమున వెనుఁదీయకఁ బోరుచున్నారు.

సోమ—ఊఁ మఱియుఁ జూడుము. ఒకటే ధోరణియా? నాకు కన్పింపలేదు. కొంచెము నిర్దేశించి చూపుము.

రామ—అదిగో సైనికమధ్యభాగమున బంగారపు జరీతో ధగధగ ప్రకాశించు ముత్యాల జాలరులతో మొకమల్ గుడ్డలతో వెలుంగు ఛత్రమన్నిటికన్న యున్నతిగఁ గన్పించుచున్న యదికదా! దానిక్రింద.

సోమ— ఆ. ఆ. చూచితిని. భేష్ ఇదియెంతయు ననుకూలమనను కొంటివి యుద్ధమాచరించుటకన్న యుద్ధవీరుఁ బ్రోత్సహించుటయే మేలని తెలియును.

(మరల తెరలో ఫిరంగులధ్వని)

రామ—ఛీ ఛీ మరల తురకలు మోసముఁ జేసి ఫిరంగుల పేల్చినారు. పాపము! హిందువులెందరు హతులైరి.

సోమ—మిగిలినవారైనను కొందరు గగ్గోలుపడియు కొందరు విరిసియు కొందరు సురగియు కొందరు పఱచియు కొందఱు వెరచియు, తలకొక దిక్కుగఁ బరువెత్తుచున్నారు. అదిగో భయపడి పోవు వారలకు తినోక్తులాడుచు వెంకటరాజు సైనికులనెల్లఁ బ్రోత్సాహపెట్టుచు నీదెసకు వచ్చుచున్నాఁడు. పాపమీవీరుఁ డీహిందూదేశమునకు పవిత్రభృత్యుఁడు—

రామ—ఆ! ఆకల్లోలమేమి సోమనాథా! మిక్కిలి యాశ్చర్యమింకొకటి జరుగుచున్నది. ఆదిల్షాహ ఐదువేల సైన్యముంగైకొని రామరాజుగారికి బాసటకై కాబోలు వచ్చుచున్నాఁడు నమ్మికమైనకొడుకు సకాలమున నుపకరించుచున్నాఁడు. మేలు మేలు తురుష్కుఁడైనను వీని పితృభక్తి నిరుపమానము. సోమనాథా! వెంకటరాజేటికో రాదరిమున నిటవచ్చుచున్నాఁడు మనమా చెట్టువైపున కొత్తిగిలుదమా!

రామ—మంచి దీవీరున కకృత్యము గిట్టనట్లున్నది. (ప్రక్కకొదుగుదురు)

(రక్తసిక్తుండై కత్తిబూని వెంకటాద్రి ప్రవేశము.)

ఉ. సైనికులార ! కృత్రిముఁ డసాధ్యుఁడు వీఁడితఁ డౌరంగ రా
జైనవిధంబు హింందువుల వాక్పటుకేఁ జుడి పుత్త్రుఁడంచు రా
జౌనని యొప్పుకొన్న మునకాయువు పూరితికల్లునింక నె
ల్లయినబలంబుఁ జూపివెనుకాడఁగ నోర్చియుఁ బాయుడి వెతల్

(తెరలో)

ఉ. తమ్మునిమాటలన్నియు యథాయథ జేయకుఁడయ్య వీరు నా
కిమ్మయిఁ గూర్చుపుత్త్రుఁడు సహీనగుణాఢ్యుఁడు చెప్పినట్టిచే
తమ్ము సరింపవచ్చునె విధాయక మేకద ? వెంకటాద్రి లే
శమ్మెరుగంగ బాలుఁడతిసాహసచర్యుఁడు గాన సైనికుల్.
ఇది నాయాజ్ఞ—

వెంక—అన్నయ్యా ? యెంతటిమాయలోఁ బడిపోతిరి! విజయనగరసామ్రాజ్యధ్వంసమునకై నీకీచెడుబుద్ధి బొడమినది! హా యెంతటి దుష్కృత్యము.

(తెరలోనుండి తుపాకివేటు తగులును.)

ఛీమూర్ఖుఁడా ! అదిలుశాహా! యెంత పనిఁ జేసితివి.

ఉ. చాటునఁ బొంచినీపలుకు సాగదటంచుఁ దలంచి నన్ను టా
టోటు తుపాకివ్రేటున నెటో వధియింపఁ దలంచినావె యా
రాటము సర్వమిట్టులవరాటముఁ జేసెద మూఢ ! మన్నిరా
ఘాటకరస్థితాసిపరికల్పిత తీక్ష్ణతరప్రఘాటిచేన్.

(పోబోయి) కాళ్లుతడఁబడి హా, హా.

గీ. వెన్నుపంచాకివతుమందున్నశల్య
చయముఁ జూర్ణంబొనర్చివిస్సమతనీ తు
పాకివ్రేటుకటా తడఁబడెడి కాళ్లు
నడవజాలనివిధమయ్యె నాయవస్థ—

(తూలి) అబ్బా! నిలువఁజాలను నిలువఁజాలను. (క్రిందఁబడి)

ఉ. జానెడుపొట్టకై పరులఁ జంపుచు స్వీయులఁజంపుకొంచు స
జ్ఞానముఁ జెందివీరమరణంబునకాస్పదమైనశూరు లే
స్థానముఁబొందువారలొ ప్రశస్తము నాకమొ లేక దుష్పథం
బౌనరకంబొ యేదియెటులైనను నాకిదిస్వర్గలోకమే—

ఏటికన,

ఉ. ఆదిలుశాహరాకడ మహాముదమందఁదలంచె రాజు మా
కీదెసఁగెల్వఁగల్గుట నికెంతయుదుస్తరమద్దసైనికుల్
హాదయ లేనిమ్లేచ్ఛులక రాసులఁబీనుగ రాసులౌచు, తా
వేదురుపాటుతోడఁ బలవింపుచు కూలుచు తిట్టిపోయరే—

వారలరోదనధ్వానముల విజయనగరవిధ్వంసనసంధానముల హిందూరాజ్యోన్మూలనముల వినకుండ నీరక్తపుటేరున నభిషేకింపఁబడి, తుచ్ఛశరీరము వాయునాకిది స్వర్గలోకమే—

హా హిందూదేశమా! నీకెట్టిమరవస్థరానైయున్నయది.

(తెరలో)

ఓరీ! వీనిని సజీవునిగ బట్టుకొనుఁడు.

వెం—ఛీ. ఛీ. యవనసైనికులు సమీపించుచున్నారు. వీరిచే పట్టుబడి నీచముగజంపబడి యథోలోకజీవితుఁడ నేలఁగావలయు.

ఉ. ఘోరతరావస్థలినకుంఠితశత్రునికంఠలుంఠనో
దారపరాక్రమస్ఫురణఁ దాండవమాడెడి ఖడ్గమా! త్వదీ
యోరుబలంబునాపయిమహాద్భుతిఁజూపుము శత్రురాజకాం
తారముచూరఁగొంటివికదా? యికనవ్వధియింపఁజెల్లదే.

గీ. నీవుజన్మించినందుకు నీరుముదముఁ
గూర్చినాఁడనుంజంపికూర్పరాదె

నాకు ముదమట్టులొటనీ నాఋణంబు
లెల్లఁ దీరును పరలోక మెల్ల మెచ్చు.

(ఖడ్గమునఁ బొడుచుకొని ప్రాణమును విడుచు)

(తెరలో)

అరే కాఫర్ మర్గయా రే మర్గయా రే—జావ్. జావ్.

(సోమ— రామ— ప్రవేశము.)

సోమ—హా! మహావీరుఁడొక్కఁడు ధరకొరిగినాడు. రామరాజునకిక నపజయమే—దాక్షిణాత్యులగు హిందువుల కెంతటి దురవస్థ రానైయున్నది. విజయనగర మిక నామమాత్రావశేషముఁ జేయక పోరు.

రామ—శివశివా! యీయన్యాయ మేమి. ఓరీమూర్ఖుఁడా! అదిలుశాహా! నీకింతటివినాశ కాలబుద్ధిగలసు.

సోమ—రామరాజుగారి సమీపవర్తులై గజసమూహము పైకి సింహచర్మము నెగురవైచి యదలించినాఁడు. సేన నెట్లు చిందఱవదరఁ జేయుచున్నది.

రామ—అయ్యో అయ్యో రామరాజుగారెక్కిన టాంజానెక మత్తగజము క్రిందబడవైచినది. పాపము వృద్ధుఁడీ వ్రేటున నసువులఁ బాయకుండునా?

సోమ—అదిగో లేచినవానిని, హా ఘోరము! ఘోరము!—ఓరీ దుష్టుఁడా! యిదేమిమోసము ఛీ. ఛీ. రామనాథా! చూడుము. చూఁడుము.

రామ—అయ్యో.

సోమ—ఉ. లేచెడివృద్ధుఁగాంచియు "బలే" యని మూర్ఖతురుష్కుఁడింత సంకోచము లేక ఖడ్గమునకుఁ బలిజేసెనిదేటిపాపమో,

రామ.—హా! చతురబ్ధివేష్టిత మహామహినెల్ల వెలుంగు రాజును త్రెంచి శిరంబు బల్లెమున నెత్తిరిదెంతటి ఘోరకృత్యమో.

సోమ.—హా! వధించుటకే కాక నస్మహాత్ముని శిరము బల్లెమునం గ్రుచ్చి పైకెత్తి చూపుచున్నారు. రామరాజా! తుదకెంతటి పాపవిధికి లోనైతివి. హా పఠానీ! యెంతక్రూరుడవురా! నిన్ను నమ్మి యంగరక్షకునిగ నుంచుకొన్నందులకు ప్రభుశిరముం ద్రుంచి నుందిపని జేసితివి. నమ్మిక స్వామిద్రోహులగు తురుష్కు నేల? రామరాజా!

సీ. ఇచ్చినాఁడవు సకలేప్సితార్థముల న
ర్థార్థులెంతయుమోదమందుచుండ,
హెచ్చినాఁడవు యవనేశ్వరుల్ గోలుబొ
మ్మలరీతి నీ పాదములవసింప
వచ్చినాఁడవు రిపువర్గకాంతారభూ
మీరుహంబులకుకుఠారుఁడవయి
నచ్చినాఁడవు కవీంద్రకృతసుకావ్యముల్
నవరసాస్వాదనానందగరిమ

గీ. "సచ్చరిత్రుండు హిందూప్రశస్తరాజ
మండలికి శిరోమణిసముండు" విజయ
నగరభానుండు రామరాజగునటంగ
తనిసితివి తుదకీగతి దనరుటయ్యో.

ఉ. అక్కటనమ్మినాఁడవుదురాత్ముని నాదిలుఖానుఁ బుత్త్రుఁడం
చెక్కుడుఁ బ్రేమదానిఫలమీగతి నిచ్చెడనీకిఁ బ్రాప్తమై
చక్కడఁచెన్ త్వదీయఘనసాహస బుద్ధికిభారతీయులే
దిక్కును లేకఁగూలెడువిధిన్ విధివ్రాయుటమాఁదు పెంత్తులన్.

రామ.—ఓయీ యింక మనమీ దక్షిణదేశమున్విడిచి యుదఙ్ముఖము బట్టవలసినదేనా?

సోము—ఓరీ? నీయుదబ్బుఖము పాపుగాను. అరుగో యవనులు మనరామరాజు శిరముంగొని జయజయ ధ్వానములహింపు పులు చెల్లాచెదరై పార నీపై పేగుదెంచు నున్నారు— వారిగుహారముల కేగుటకిదిమార్గమేమో!

[illegible]—ప్రాణముఁబుండిన బలుసుకూరదైనం దినవచ్చును. పడ పడ (నిష్క్రమింతురు.)

(యవనులు బల్లెముల రామరాజు శిరముఁగుచ్చుకొని ప్రవేశము.)

యవ—జేయ్. ఆదిల్షాహా మహారాజుకీ జేయ్. కుతుబ్షాహా మహారాజుకీ జేయ్. బరిద్షాహా మహారాజుకీ జేయ్. నిజాంషాహా మహారాజుకీ జెయ్.

(అంతట నవాబులును సలకము తిమ్మయ్యయుఁ బ్రవేశము.)

తిమ్మ—నవాబులారా: ఇక్కడికి హిందూసైన్యముఁ బూర్తిగ నోడింపఁబడినది. దురాత్ముఁడును మనకాజన్మద్వేషియునగు రామరాజు వధింపఁబడినాఁడు. జయము మనకబ్బినది.

ఆది—(కనుసైగఁ జేయును.)

నిజాం—ఎందరు యవనవీరులు ప్రాణముఁగోలుపోయిరి. ఎందరు మహాశూరులు బ్రతుక రానంత బాధననుభవింపుచుండిరి. ఏనుగులు గుఱ్ఱములు, పదాతులు, ఆయుధములు, నల్లమందు, ద్రవ్యము, వేయేల తిమ్మయ్యగారూ! విజయనగరమందలి ద్రవ్యాగారము లేగాక, పశు ధాన్యాదిక మంతయు విక్రయించినను మాకర్ధపాలైన లాభము లేదు. పాడుయుద్ధము లేకుండినను మేలు. నీమాయమాటలనంతయుఁ గోలుపోతిమి.

తిమ్మ—(తనలో) అయ్యో! వీరిట్లు నుడువుచున్నారేమి? తుదకీ యూవరిసంగముల నన్నుఁ బకీరు నొనరింపరుకదా? (ప్ర) మహారాజులా

రా ! ద్రవ్యము నష్టపడినమాట నిజమే. కాని, మనపక్కలో బల్లెముపాడైనదికదా ! స్వేచ్ఛగా జీవింపవచ్చును. దక్షిణదేశమంతయు మనకులోంగ వర్తించునుకదా? ఆదిలుశాహా మహారాజా ! నామాట.

ఆది—(సైగఁజేయును.)

కుతు—నీమాటయేమి ? పాపాత్ముఁడవగు కాఫరువు. నీకొక మాటకలదా ? నీమొగముఁ జూడరాదు. నమ్మిన హిందూ ప్రభువుల నాశనముచేసిన దౌర్భాగ్యుఁడవు.

నిజాం—అబ్బో! వీనికిఁ జనువీయరాదు. స్వతంత్రమిచ్చిన కుతంత్రములఁ బన్ను ప్రజ్ఞావంతుఁడు; వారినట్లుచేసి యవనులమును మతేతరులనుగు మనమేమి చేయఁగలడో.

బరీ—ఆలోచనమెందుకు వీనిశిరము నేను ~~తెగఁగోయిం~~పుదును.

తిమ్మ—అయ్యో! అయ్యో! మీకింత సహాయముఁజేసిన నాకీగతియా ?

బరీ—అరే ! నీసహాయమెందుకోయ్. ఎవరురా !

సేవ—జీ మహారాజ్.

బరీ—వీనింగొనిపోయి మనయేన్గుచేఁ ద్రొక్కింపుఁడు.

సేవ—చిత్తం- ఆరేభామ్మన్. ఆవ్—(చేయిపట్టుకొనును.)

తిమ్మ—హా. నాకీదురవస్థ రాతగినదే.

ఉ. పావనుఁ దండ్రిలేని పసిపాపనిఁ జంపితి పట్టమెల్లన న
ప్పావకు కీలగాల్చితిని పాపులువీరికి నైకమత్యమున్
యీవిధిఁ గూర్చి హిందువుల నెల్లహరించితి నాకుదగ్గశి
క్షావిధినిన్ విధించిరి ప్రశస్తము వీరిమనోప్రభావముల్

నాకిదితగును. ముమ్మాటికితగును. సేవకా! నడువుము.

ఆదిల్షాహాసార్వభౌమా ! నేనరుగుచున్నాఁడను.

ఆది—ఊఁ.

(సలకము తిమ్మయ్య భటునితో నిష్క్రమించును)

ఆది—యుంక నశేషము వదలించుకొంటిని. విజయనగరమున కీనాడే ప్రయాణము. మనవారలకిరి అందుఁగల ధనకనకవస్తువాహనములెల్లను హరించి దానందొరకునవియెల్ల మీయిష్టమని మన సైనికుల కనుజ్ఞనొసంగి పురము సర్వశూన్యమొనర్చి మరి మనమన నిజరాజ్యముల కరుగుదము. యెవరిమార్గముల వారలమై పోయెదము.

ఒక—మంచిది.

(నిష్క్రమింతురు.)

(పెనుగొండలో రాజభవనము. తిరుమలాద్రియు, సదాశివరాయలును)

తిరు—మామా! రణమునుండి యెట్లో ప్రాణముల దక్కించుకొని యంతఃపుర కాంతలతో ఐదువందల యేబది యేనుఁగులపై రత్నమణి సంచయముఁ గైకొని యీ పెనుగొండ కఱచేరి ప్రాణముల నరుగు దెంచితిమికదా? కళావిహీనమై యరాజకమై రోదనధ్వాన భీషణమై ప్రజానిర్వేదసంకులమై యవనధాటీపరాఘాత సంకుచితమై గిడ్డడి పాడి విజయనగర మెంతటి విపదంబుధి మునిగి యున్నదియో కదా? యాహా! మహోన్నతస్థితి ననుభవించిన యానగర పురస్థితినిదలంచిన గుండెలు వ్రీలుచున్నయవి.

సదా—ఇదియంతయు మీయన్నగారి మహాత్మ్యమే కాని వేఱొండుకాదు—విద్యారణ్య మహాముసీంద్ర నిర్మాణ కౌశల విశాలంబై సాళువవంశాగత ప్రభాకర సమ్ముదాయ విధాయక ప్రభా భాసితంబై యనతర రామరాజేంద్ర మహాభుజస్కంధస్థిత మహదైశ్వర్య ధురంధరమై—సకలజన సౌఖ్య సాధాయకమై సర్వరాష్ట్ర నాయకమణియై బొల్పారు విజయనగర మంతర్ధానమయ్యె.

సేవ—(ప్రవేశించి) మహారాజులారా! వందనములు.

సదా—ఓయీ యేపని పెట్టి వచ్చుచున్నారా యేమి? కర్తవ్యము కర్తవ్యము.

సేన—రాజేంద్రా! అట్టియుకదగిన మేదియులేదు. విజయనగర సామ్రాజ్యధ్వంస మీపాటనోటచెప్ప నేతెంచితిని ఆవిధి యుద్ధానంతరము రెండవరోజు మొగలాయీలు మొదలగు సవాబ్బ పురముప్రవేశించి యాంగడములు దోచుకొనిరి, మూడవరోజు యవనులు పురంబుప్రవేశించి చిక్కినదక్కిన ప్రజలవధించి సర్వస్వముహరించి కాల్చి కూల్చి పడగొట్టి చెడగొట్టి రూపుమాపి మహాస్మశానము మార్చివైచిరి; ఇదివిన్నవించ నేతెంచితి.

తిరు—సరియె యిదిట్లగునని యే యూహించితిమి మామా! జయనగరధ్వంసమునకై విచారించినలాభము లేదు. రేపు సుముహూర్తమున నిన్నె పెనుగొండ రాజ్యపట్టాభిషిక్తుండవుగ జేతుము. అనంతరము భగవత్కృపవలన శిథిలముండిన విజయనగర మెప్పటి విజయనగరము జేయవచ్చును—కావున గతము గతము. మామా: ఊరక యాలోచించెదవు; నీకోర్కె యెట్లు?

సదా—నాయనా! నాకోర్కెలన్నియు విజయనగర వినాశముతోనే తీరినవి. ఇక నిట్లగుగాక.

భరతవాక్యము.

ఉ॥ [illegible]పులనమ్మి మోసముల పాలయిపోవక నుండ్రిగాక స
మ్యక్ప్రవృత్తి భారతీయుల [illegible] విభూతి యొసంగెదుగాక సర్వవి
ద్యాపటిమన్ [illegible] రచి[illegible]
[illegible] లకు లాదు[illegible]

సమాప్తము.

